## ఉత్తర భారత యాత్రలు

| | | Frequency | Fare |
|---|---|---|---|
| 1 | Delhi-Shimla-Kulu-Manali-Chandigarh-Delhi | Every Friday | |
| 2 | Delhi-Agra-Jaipur-Delhi | Every Monday | |
| 3 | Delhi-Mussoorie-Haridwar-Rishikesh-Delhi | Every Friday | |
| 4 | Delhi-Mathura-Brindavan-Agra-Allahabad-Varanasi Saranath-Gaya-Budha Gaya-Lucknow-Ayodhya-Naimisaranya-Delhi | Every Friday | |

Fare includes complimentary Dormitary accommodation and transport/ Guide charges. Tariff for Tour No.4, is inclusive of food also enroute, except at Delhi. We are running LTC tours for Central Government employees in collaboration with ITDC. All tours are by Super Deluxe buses, starting from our New Delhi office. Contact our offices for advance reservations.

మీరు ఢిల్లీ వచ్చినపుడు అధునాతన సౌకర్యములతో నిర్మింపబడిన మా "హోటల్ సదరన్"లో బసచేయండి. ఢిల్లీలో మా హోటల్‌లోని అమరావతి/ సుప్రభాత్ రెస్టారెంట్లలో రుచికరమైన తెలుగు భోజనం, అరిశెలు, బందరు లడ్డు, బూంది, చెగోడీలు, మొదలగు తీపి/కారం పదార్థములు కూడా లభించును.

*Our Super Deluxe Video buses & tourist cars are available on contract for tourists. Our recipts are approved for LFC purposes.*

***Air/Rail Reservations are also undertaken.***

**for more details, please contact**

**Southern Travels/Hotel Southern**

**(Recognised by Department of Tourism, Govt. of India, New Delhi.)**

**ఢిల్లీలోని తెలుగు వారి ఏకైక వాణిజ్య సంస్థ**

**18/2, Arya Samaj Road, WEA Karolbagh, New Delhi**

**(Phones : 5722210 (6 Lines); 5739508, 5782932)**

**Our branches**

1. Hotel Ayodhya Building, Lakdi-ka-pool, Hyderabad - 500 004. (Phones : 223658; 227233)
2. Hotel Raj Kamal Complex, Near Shivananda Stores, Kumara Park East, Bangalore - 560 001 (Phones : 2267040; 2262633)
3. Hotel Howrah Complex, Opp Madras Central Railway Station, Madras - 600 003 (Phones 564864, 585253)
4. No 10, Swarnalok Complex, Opp Apsara Theatre, Eluru Road, Governorpet, Vijayawada - 520 002 (Phones : 62227, 66624)
5. Pavan Palace, Ground Floor, Opp. T.S.R. Complex, Dwarakanagar, Visakhapatnam - 530 016. (Phone . 545565, 541099)

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్
హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూ తమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రికులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండి నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రికులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి — అధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

తైల ప్రపంచములో మణి దీపాలు




# MR
## బ్రాండ్

డబుల్ రీఫైండ్
గ్రౌండ్‌నట్ ఆయిల్
డబుల్ రీఫైండ్
సన్‌ఫ్లవర్ ఆయిల్
మరియు
డబుల్ ఫిల్టర్
గ్రౌండ్‌నట్ ఆయిల్

" ఆరోగ్య
సంరక్షణలో
ఇప్పటికీ వీటిదే
పైచేయి "

1, 5, 15 కే.జి.ల
ఆకర్షణీయమైన
ప్యాకింగులలో
- లభించుచున్నవి.

గుర్తుంచుకోండి
ఎం.ఆర్. బ్రాండ్
వంటనూనెలు అతి
ప్రశస్తమైనవి – అతి
స్వచ్ఛమైనవి.

**MADHU REFINARY PRIVATE LIMITED**
**GOOTY (RS) - 515 402. ANANTAPUR Dt.**
©:31, 64, 74.

Phones : 42729, 42730, 42731 Fax : 42730, STD : 08552.

**MADHU SOLVENT EXTRACTIONS (PVT.) LTD.,**
**Station Road, GOOTY R.S. - 515 402. Anantapur Dt.**

Manufacturers of : DEOILD CAKES & SOLVENT EXTRACTED OILS.

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

స్థాపితం : 1961

హెడ్ ఆఫీసు : కంభం-523 333. ప్రకాశం జిల్లా. ✆ : 32262 (S.T.D. 08406)

బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం-518 101. కర్నూలు జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524)

అతి పవిత్రమైన జోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్ ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడినందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 115 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకూ జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందు సదుపాయం గలదు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు గల దాత ఫోటో (ల్యామినేషన్) సత్రం ఆఫీసు నందు బిగించబడును

రు.1160-00 ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు ప్రతి సంవత్సరము దాతకోరిన్న రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో (ల్యామినేషన్) సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవితసభ్యులుగా ఉంటారు ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతి యొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము

పోలిశెట్టి సత్యనారాయ
ధ్యక్షులు

యక్కలి బాలరత్నం
ప్రధాన కార్యదర్శి

# వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)

**స్థాపితము**
1969

**సంపుటి**
28

**సంచిక**
8



**ఏప్రిల్ - 1997**



సంపాదకులు :
'సంఘోద్ధారక'
'వైశ్యభూషణ'
పి.ల,



ప్రాప్తిస్థానం :

"వాసవీ భవన్"
జయనగర్ కాలనీ,
కడప - 516 002.
ఫోన్స్ : 24911, 25025.


సంపాదకీయం

# కృతజ్ఞతకు గుర్తు "వాసవీ జయంతి"

చంపవలసింది మనిషినికాదు. మనిషిలోని దానవత్వాన్ని - ఈ సత్యాన్ని ప్రపంచానికి చాటేందుకే 'ఆదిశక్తి' వాసవీదేవిగా కలియుగములో అవతరించింది. వర్ణాశ్రమాచార ధర్మ సంరక్షణకై తన నిండు జీవితాన్ని అగ్నికాహుతి చేసుకొంది.

సీతమ్మ కూడ అగ్ని పరీక్షకు సిద్ధపడింది. ఆ పరీక్షలో నెగ్గింది. తన ప్రాణేశుని తరఫున పరగృహాంతర్వాస దుర్నిందను మాన్పుకొనుటకు.

వాసవి అకళంక వృత్తిని తన తనువును త్యాగం చేసింది. ఎందుకు? తను నమ్మిన ధర్మానికీ, తాను ప్రబోధించిన అహింసా పద్ధతికీ భంగము కలుగకుండుటకు. అహింసయే పరమ ధర్మము అను వేదవాక్యాన్ని వాస్తవములో చూపించుటకు. అందుకే 'వాసవి' ప్రపంచములోనే ప్రథమ సత్యాగ్రహి. అపూర్వమైన తన ఆత్మార్పణ ద్వారా ఆర్యవైశ్య జాతికి చరిత్రలో తిరుగులేని - సాటిలేని మేటి స్థానాన్ని కల్పించింది. మానవిగా పుట్టి మహోన్నతను సాధించి మణి పూసగా నిలిచింది. కనుక ఆర్యవైశ్యులెల్లరా తల్లిని సదా సంస్మరిస్తూండాలి.

తనకు గల పద్నాలుగు నామములో నొకటైన "కన్యక" అను పేరుతో మణిద్వీపములో కొలువై, సృష్టిస్థితి లయాలను తిలకిస్తూ - ముగురమ్మలకూ, ముగురయ్యలకూ మూలమైన 'ఆదిశక్తి' అవతారం కనుకా- ఆర్యవైశ్యులెల్లరూ శ్రీ వాసవీ దేవిని ఎప్పుడూ ఆరాధిస్తూండాలి అవ్యభిచారమైన భక్తితో.

వాసవీ జయంతినీ - ఆత్మార్పణ దినాన్నీ మరచి పోకుండా ప్రతి యేడూ జరుపుకోవాలి ఇంటింటా. జయంతి వైశ్య శుద్ధ దశమిన, ఆత్మార్పణ దినం మాఘశుద్ధ విదియన వస్తాయి.

ఈ యేడు రానున్న వైశాఖశుద్ధ దశమి అంటే **16-5-1997న**
'౦ వాసవీ జయంతి వస్తూంది. ఆ రోజు ప్రాతః కాలాన్నే ఇంటి ముంగిలిని శుభ్ర పరచుకోవాలి, కలయంపి చల్లాలి. ముత్యాల ముగ్గులతో ముచ్చటగా తీర్చి దిద్దాలి. ప్రధాన ద్వారానికి మామిడి తోరణాన్ని కట్టాలి. ప్రొద్దున్నే అందరూ అభ్యంజన స్నానం చేయాలి. నూతన వస్త్రాలను ధరించాలి. "అమ్మ"ను అతి భక్తితో ఆరాధించాలి. ఈ ఆరాధన శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మ సంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ నిర్ణయించిన అధికారిక ఆరాధనా పద్ధతిలోనే జరగాలి.

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు; ఆర్యవైశ్య ధర్మ సంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ విడుదలచేసిన 'ఆడియో కేసెట్' లోని సుప్రభాత శ్రవణముతో తమ హృదయారవిందాలలో వాసవీ దేవిని మేల్కొలుపు కొనుటతో ఆనాటి మీ యీ జయంతి కార్యక్రమం ప్రారంభమవ్వాలి

శ్రీ సూక్త మంత్రాలతో ఆవాహనాదిషోడశోపచారాలు చేసి శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవిని అష్టోత్తర లేక శతోత్తర సహస్ర నామములతో పూజించాలి. శక్తి కొలది నైవేద్య సమర్పణ జరగాలి. తీర్థ ప్రసాదాదులు స్వీకరించాలి.

ఆనాటి సాయంత్రం పునఃపూజ చేయాలి.

అంధకార బంధురమైన ప్రపంచములో అహింసా జ్యోతిని వెలిగించుటకూ, ఆర్యవైశ్యాన్వయ సంజాతగా ఆదిశక్తి దివినుండీ భువికి వచ్చినందుకూ కృతజ్ఞతగా ఈ జయంతిని 16-5-1997న జరుపుకోవడం ఆర్యవైశ్యుల కర్తవ్యం.

కృతజ్ఞతకు వ్యతిరేకపదము కృతఘ్నత. కృతజ్ఞత అంటే పొందిన ఉపకారాన్ని మరువకుండుట. కృతఘ్నత అంటే పొందిన ఉపకారాన్ని విస్మరించుట. 'విను' కృతఘ్నుని మాంసము కుక్కలు తినగా రోయున్ - అంటూంది భారతం.

# కరుణ కవి 'కరుణశ్రీ'

(సంపాదకుల ఆకాశవాణి ప్రసంగాల నుండి)

"ముద్దులు గార భాగవతమున్ రచియించుచు పంచదారలో

నద్దితి వేమొ గంటము, మహాకవి శేఖర! మద్య మద్య,అ

- ట్లద్దక - వట్టి గంటమున నట్టిటు గీచిన తాటియాకులో

పద్దెము లందు - ఈ మధుర భావము లెచ్చట నుండి వచ్చురా!"

పోతన్న గారి కవితా మాధుర్యాన్ని ఉగ్గడిస్తూ కరుణశ్రీ గారు చెప్పిన పద్యమిది. ఈ పద్యములో కరుణశ్రీ అన్నట్లుగా పోతన్న గారు తన గంటాన్ని పంచదారలో అద్దినారో? లేదో? కానీ కరుణశ్రీ గారు నూటికి నూరు పాళ్ళు తమ కలాన్ని పంచదారలో అద్దే వ్రాశారు. అందుకే వీరి పద్యాల్లో ఇంత మాధుర్యము.

మాధుర్యమే కాదు. లాలిత్యము కూడ ఆయన పద్యాల్లో పలుకు పలుకునా పరిమలిస్తుంది. తట్టి పలకరిస్తుంది. అందుకే ఆయన పద్యాలు పాఠకుల హృదయాల మీద చెరగని ముద్రను వేసుకొన్నాయి.

సంస్కృతములో దండి మహాకవి పద లాలిత్యానికి పేరు. తెలుగు సాహిత్యములో ఈ పద లాలిత్యాన్ని అతి శ్రద్ధగా అతి జాగ్రత్తగా పోషించారు కరుణశ్రీ. అందువల్లనే వీరిని 'తెలుగు దండి' అని ప్రశంసించారు మహాకవులూ, పండితులూ.

'కరుణశ్రీ' అనేది జంధ్యాల పాపయ్య శాస్త్రి గారి అన్వర్థ పౌరుష నామధేయము.

కరుణశ్రీ అనేది అసాధువు అనగా వ్యాకరణ సాధ్యము కాదు అని కొందఱి మతం. కరుణాశ్రీ అనేదే సరియైనదనీ, సాధువు అనీ కొందఱి అభిప్రాయము. కరుణశ్రీ అంటే కరుణా, మానవత, దయ మొదలగునవి అనీ, కరుణాశ్రీ అంటే కరుణ మాత్రమే అనీ వివరిస్తూ కరుణశ్రీ అనేది సాధువే. అసాధువు కాదు అంటారు కొందరు.

కరుణ రస పరిప్లుతములై, మాధుర్య గుణ ప్రయుక్తములై ఉంటాయి శాస్త్రి గారి పద్యాలు. లాలిత్యమూ, మాధుర్యాలకు తోడు శాస్త్రి గారి 'కుంతీ కుమారి', 'సతీ అనసూయ', 'దనుర్భంగము', 'సతీ సావిత్రి' మొదలగునవి పౌరాణిక పాత్రలు కావడంతో వీరి పద్యాలకు మరింత తియ్యదనం సమకూరింది.

ఆదికవి నన్నయ వృత్త రచనలోని గంభీర గమనమూ, సంస్కృత సమాసాలలోని సరళత్వమూ, మధురత్వమూ, తిక్కన సజీవ పద ప్రయోగంలోని గరువమూ, శ్రీనాథుని సీసాలలోని తూగు, పోతన పద్యాలలోని మందార మకరందాల తియ్యదనమూ, దాక్షిణాత్య కవుల కమ్మని తెలుగు పలుకు బడులూ రాశీభూతమై శ్రీ పాపయ్య శాస్త్రి గారి పద్యాల్లో ఎక్కువగా సాక్షాత్కరిస్తాయి.

వైశ్యప్రబోధిని, ఏప్రెల్ 1997

అపాత మధురమైన, సరళ పద ప్రయోగ విన్యాసములో శాస్త్రి గారు బహు నేర్పరులు. తిరుపతి కవుల తర్వాత తెలుగు పద్యాన్ని తిరిగి ప్రజల నోళ్ళ మీదకు తెచ్చిన ఘనత స్త్రి గారిదే. వీరి కలానికి ఘంటసాల గారి కమ్మని కంఠము తోడు కావడముతో తెలుగు పద్యం యొక్క కమ్మదనము మరింతగా గుబాళించి, తెలుగు దేశం దశ దిశలా విస్తరిల్లింది. శాస్త్రి గారి ఖండ కావ్యము ఉదయశ్రీ ప్రథమ భాగములోని పుష్ప విలాపము, కుంతీ కుమారి, బీదపూజ, సార్థకత, స్వేచ్ఛా పుష్పాలు అనుశీర్షికలలోని పద్యాలను మధుర గాయకులు స్వర్గీయ ఘంటసాల 1948లో పాడారు. 'ఆడియో రికార్డు' లోకి ఎక్కిన ఆ మధుర స్వరాలు ఇప్పటికీ శ్రోతల వీనులకు కమ్మని విందునిస్తూ కవికీ, గాయకునికీ అమృ తత్వాన్ని ప్రసాదిస్తున్నాయి.

శాస్త్రి గారి రచనల్లో లాలిత్యమూ - మాధుర్యమే కాదు చక్కని తూగూ ఉంటుంది. వర్ణణలు ఉచితంగా సందర్భ శుద్ధితో ఉంటాయి. సమయజ్ఞత, స్పష్టత చక్కగా కన్పిస్తుంది. విసుగు కొంచము కూడ కలుగకుండా కమ్మగా కలాన్ని నడపుటలో కడు సమర్థులు శాస్త్రి గారు. ధారాశుద్ధి, పాకపరిపక్వత ప్రస్ఫుటంగా ఉంటుంది. నీరసమైన పద్యం ఒక్కటి కూడా శాస్త్రి గారి పద్యాల్లో అగుపించదు. చిక్కని తెలుగు నుడికారపు సొంపులూ, వంపులూ శాస్త్రి గారి పద్యాల్లో తామర తంపరలు.

'అల కలహ భోజనుని పలహారమునకు
నినుప గుగ్గిళ్ళు వండి వడ్డించి నావు,
అమ్మ! నీ చేతి తాళింపు కమ్మదనము
భరత దేశాన గుమగుమ పరిమళించె'

"వేద వేదాంత సౌవర్ణ వీధులందు
తిరుగు చుండెడి దివ్యమూర్తి త్రయమ్ము
నేడు నీ వంట యింట దోగాడు చుండె
గోరు ముద్దల గుజ్జన గూళ్ళు తినుచు".

శాస్త్రి గారి సతీ అనసూయ శీర్షికలో గల పై పద్యాల్లోని అమ్మనీ చేతి తాళింపు కమ్మదనము, గోరు ముద్దలు, గుజ్జన గూళ్ళు - చక్కని తెలుగు నుడికారాలు. ఇదే శీర్షికలో గల "అహో! పురిటి స్నానములున్ నడికట్లు లేవు" అను పదాలను పరికిస్తే శాస్త్రి గారి తెలుగు నుడికారపు పద ప్రయోగానికి ఆహా అని తలలూపక ఉండలేము.

శాస్త్రి గారు హృదయవాది. ఉదయశ్రీ ప్రథమ భాగములోని 'సార్థకత', 'బీదపూజ' అను శీర్షికలోని ఈ పద్యాలు ఇందుకు ఉదాహరణలు.

"పరిమళము లేక ఎవరికి పనికిరాక
పాఱవేయ బాటల ప్రక్కబడి కరాళ
కాల పురుషుని కారుచక్రాల క్రింద
బ్రదుక లేని దరిద్ర పుష్పమ్ము లవ్వి"

వాసన పోయినవీ, రోడ్ల మీద పాఱ వేయబడినవీ అయ్యి కూడ ఆ పుష్పాలు హృదయమున్న వారికి గొప్పగానే కన్పిస్తాయి. అందుకే శాస్త్రి గారు ఆ వాడినా, ఆ వాసన లేనీ పూలను శివుని పాద
తీసుక పోగలిగారు. ఆదరింతువో? లే నా బీదపూజ అంటూనే అవి ఆగి ఉన్నాయట.

వైశ్యప్రబోధిని, ఏప్రిల్ 1997

"హాయి మేయుచు శయ్యాగృహాంత
రాల పూల పాన్పులపై బడి పొరలు
చున్న సుమాలు మనుజ మహిషాల
అడుగున మణగి పోవుచున్నవిగా"

కన్పించాయి శాస్త్రి గారికి. హృదయ ఉన్న వానికే ఇటువంటి భావాలు కలుగు తాయి.

ప్రకృతిలోని సున్నితత్వాన్నీ, శృంగారాన్నీ శాస్త్రి గారు చక్కగా ఆకళింపు చేసుకున్నారు. పుష్ప విలాపము - బీదపూజ - సార్థకత - స్వేచ్ఛా పుష్పాలు మొదలగు శీర్షికలు ఇందుకు సాక్ష్యాలు.

సమాస నిర్మాణములో శాస్త్రి గారు మహా నేర్పరులు. 'నిర్మలాంబు నిష్యంద మహా హిమాచల తటాంచల చంచల గాంగ నిర్ఝరము' 'ప్రశాంత మాధురీ మసృణ మనోజ్ఞ దివ్యసుషమా సుకుమారము' ఇత్యాదులు వీరి ఈ నేర్పరి తనానికి దృష్టాంతాలు. సమాసములో ఎక్కడా కఠిన పదం లేదు. పదాలకు ప్రయత్నించినట్లూ లేదు. సమాసమంతా చక చకా సాగింది. 'మసృణ మనోజ్ఞము'. 'సుషమా సుకు మారము'. ఈ పదాలు మనకు ఎంత ఇంపును కల్గిస్తున్నాయో పరికించండి.

శబ్దాలంకారాలు శాస్త్రి గారి రచనల్లో కోకొల్లలు. అక్షర రమ్యత వాటిలో కొట్టవచ్చి నట్లు కన్పిస్తుంది. శబ్దాలంకారాలనే కాదు. అర్థాలంకారాలను వ్రాయడములో కూడ శాస్త్రి గారు సిద్ధహస్తులు.

"సంజ వెలుంగులో పసిడి ఛాయల
ఖద్దరు చీరగట్టి, నా
రింజకు నీళ్ళుపోయి శశిరేఖవా, నీవు
సుభద్ర సూతివై
రంజిత పాణిపల్లవము వ్రాయుదునా?
నినుమౌళి దాల్చి, మృ
త్యుంజయమూర్తినై జముని తో
తొడగొట్టి సవాలుచేతునా?"

"భిక్షాందేహి యటంచు పుత్రుడు
సమీపింపన్ ప్రమోదాశ్రువుల్
వక్షోజమ్ముల బార తల్లి కరుణా
వాత్సల్య సంపూర్ణయై
భిక్షంబెట్టె; నెఱుంగదీతఁడు జగత్
ప్రేమైక దీక్షా మహా
భిక్షూత్తంసమటంచు; భావిగతి
భావింపంగ రాదేరికిన్"

ఈ రెండు పద్యాల్లోను అర్థాంతర న్యాసం ఎంతో రమణీయంగా ఇమిడింది.

అందము చిందిపోవ చెవియందలి
చెందొవజారుచుండ "పూ
లందు కొనుం" డటంచు సుమనోంజలి
ముందుకుచాచి శైల రా
ణ్ణందన వంగె - చెంగున సుమాస్త్రుని
చాపము వంగె-వంగె బా
లేందు ధరుండు కాన్కలు గ్రహింపగ
ఉన్నమితోర్ధ్వ కాయుడై"

ఈ పద్యం శాస్త్రి గారి అర్థాలంకారాలలో ఒక్కటగు సహోక్త్యలంకార ప్రయోగానికి నిదర్శనము. ఎవరైనా సహోక్త్యలంకారానికి ఉదాహరణంగా ఏదైనా పద్యాన్ని చూపించా లంటే ఇంత కంటే మంచి పద్యము మృగ్యము" అని అంటారు నండూరి వారు.

భవభూతి తరువాత కరుణ రసాన్ని ఇంతగా పోషించిందీ, ప్రేమించిందీ శాస్త్రి గారొక్కరే. ఆయనలో సహజంగా గల్గ కరుణ రసము మీది మమకారానికి,

కరుణామయుడైన బుద్ధుని మీది ప్రత్యయము కూడ తోడు కావడముతో కరుణశ్రీ లోని కరుణా రసము మరింతగా పొంగులువారి ఆయన కవిత్వాన్ని కరుణ రసప్లావితము చేసింది.

కరుణశ్రీ గారికి బుద్ధుడు కరుణా సింధువు. ఏ చిన్న అవకాశం వచ్చినా ఆయన ఈ మాటలను అనకుండా ఉండలేడు. 'నవ్వునప్పుడు కరుణా సింధువగు బుద్ధ భగవానుభంగి కన్పట్టు స్వామి' అంటాడు సత్యసాయి బాబాను నుతిస్తూ.

కొందరు నవరసాలకూ శృంగారము రసరాట్టు అంటారు. కాదు. కరుణకే ప్రధాన పట్టం అంటారు మరి కొందరు. శాస్త్రి గారికి కరుణరసము అంటే మహా ఇష్టమని ముందే చెప్పాను. కరుణా సముద్రుడైన గౌతమ బుద్ధుని జీవిత గాధను ఇతి వృత్తంగా తీసుకొని ఎంతో ఆసక్తితో, మధు రాతి మధురంగా వ్రాసిన తన కావ్యానికి 'కరుణశ్రీ' అనే పేరు పెట్టారు. కరుణకవి అని గూడ శాస్త్రి గారికి పేరు. శాస్త్రి గారికీ కరుణ రసానికీ ఉన్న అనుబంధము అంతటిది. ఆధునిక భారత ప్రజలే కాదు. విశ్వమానవ కోటి ఆశయాలనూ, అను భూతులనూ మధురాతి మధురంగా, లలితాతి లలితంగా, మసృణ మనోజ్ఞంగా ఛందో గానం చేశారు. అందుకే వీరి కరుణశ్రీ కావ్యానికి ఉపశృతి వ్రాస్తూ శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులు గారు ఈ 'మహాకవి నూత్న యుగ ప్రవక్త' అన్నారు.

అహింసాతత్వాన్ని బాగా వంట పట్టించు కొన్నవారు శాస్త్రి గారు. అందుకే బుద్ధుడు, గాంధీ వీరిని బాగా ఆకర్షించారు.

ఈ మహిని స్వర్గ ఖండము చేయమనీ హాలా హలాన్ని దివ్యామృతంగా మార్చమనీ - అంటూ - తుదకు కరుణా కళాధరా! అని సంబోధించి, ప్రేమ్మరసైక వృష్టిని కురిపించ మని ఈ జగత్తుకు తన దివ్య సందేశాన్ని వినిపించిన మహా కవులు వీరు.

శాస్త్రి గారు ప్రజాకవి కూడ. ఉదయశ్రీ రెండవ భాగము లోని 'పాకీపిల్ల' అను కావ్య ఖండిక ఇందుకు ఉదాహరణ. అందుకే ఆయన

"పాకీదానిగ" నాడిపోసికొను ఈ పాపిష్ట లోకమ్మునీ

"బాకీ" తీర్చు కొనంగలేదు జగదంబా! జన్మ జన్మాలకున్ - అని అనగలిగాడు. పాకీపిల్ల కవికి జగదంబగా కన్పించింది. హృదయములేని వారికి ఇట్టి భావాలు రావు.

వ్యాకరణ దోషాలూ, ఛందో భంగాలూ కరుణశ్రీ కవితల్లో కన్పిస్తాయంటారు కొందఱు. అవి, ఆయన తెలియక చేసిన తప్పులు కావు, తెలిసి చేసినవే. శాస్త్రి గారి దృష్టి ఎప్పుడూ రసం మీద, పద లాలిత్యం మీద, మాధుర్యం మీద ఉంటుంది. ఆ దృష్టితో సాగే ఆయన పై రెండింటినీ, తెలిసే ఉపేక్షిస్తారు. ఇటువంటి ఉపేక్ష వీరి ఒక్కరిలోనే కాదు. మహాకవులు అనేకుల్లో ఉంటుంది. కొందరు రసానికి ప్రాముఖ్యత నిస్తే, మరి కొందరు భావానికీ - మరి కొందరు ఔచిత్యానికీ ప్రాధాన్యతను ఇస్తారు. సరస్వతీ పుత్రులు స్వర్గీయ పుట్టపర్తి నారాయణా చార్యులు భావానికి మాత్రమే పెద్ద పీట వేసేవారు. చిన్న చిన్న వ్యాకరణ దోషాలనూ, ఛందో భంగాలనూ

తెలిసి కూడ ఉపేక్షించే వారు. స్వర్గీయ గడియారం వెంకట శేషశాస్త్రి గారు ఔచిత్యానికే అగ్రతాంబూలం ఇచ్చేవారు. ఎంత మంచి పదం స్ఫురించినా దానివల్ల ఔచిత్యానికి భంగం కలుగుతుందంటే గడియారం వారు స్వీకరించే వారు కారు. ఇటువంటి అప వాదు మహాకవి జాషువా గారికి కూడ ఉంది. విశేషణాన్ని వాడడంలో ఆయన అంత శ్రద్ధ చూపే వాడు కారట. చెప్పదలచుకొన్న దానిని సూటిగా చెప్పడములో ఆయన ప్రత్యేక శ్రద్ధ చూపిస్తాడు. మహాకవులు ఇటువంటి చిన్న చిన్న అంశాలకు ప్రాముఖ్యత నీయరు. అర్థాలంకారాల మీద కొందరూ, శబ్దాలంకారాల మీద కొందరూ మక్కువ కలిగి ఉండి, వ్యాకరణ, ఛందో దోషాలను తెలిసి కూడ చేసే మహా కవులూ ఎందరో ఉన్నారు. కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు రసైక వాదులు. ఆయన దృష్టి యావత్తూ రసం మీదే ఉంటుంది. "నేను ప్రధానంగా రసైక వాదిని - రసావేశంలో ఔచిత్యాన్నీ, భాషనూ, రూపాన్నీ కూడ గమనించు కోనని" విశ్వనాథ వారు ఒక చోట స్వయంగా చెప్పుకొన్నారు. 'ఇటువంటి మాట వల్ల కరుణశ్రీ ఘనత తగ్గదు. కాకపోతే అలా అనే వారి లోని సంకుచితత్వం స్పష్ట మౌతుంది.

"ఒడు దుడుకు లేని పథము వెంబడి రథమ్ము
నడచు చుండెను సుకవి ఛందమ్ము మాడ్కి"

అని ఛందస్సును ఉపమా[illegible] వాడుకొన్న వీరు ఛందో భంగాన్ని అంగీక రిస్తారా?

అఖండ యతిని శాస్త్రి గారు హెరాళంగా వాడుతారు. స్వాగతమో! స్వయంవర సమాగత రాజకుమారు లార! అనుటలో ఉన్నది అఖండయతే. అఖండ యతిని అప్పకవి అంగీకరించాడు. ఇందులో సొగసు ఇనుమడించింది. తూగు నాట్యం చేసింది.

లలిత పదాలంటే శాస్త్రి గారికి అతి మక్కువ. ఆయన ఏ కావ్యాన్ని చదువుచున్నా, ఏ గ్రంథాన్ని పరిస్తున్నా దృష్టి అంతా లలిత పదాల మీదనే ఉంటుంది. అటువంటి లాలిత్యం గల పదాలను గుర్తుంచుకొని తన రచనల్లో వాడుకొనే వారు. ఈ పద లాలిత్యాన్ని శాస్త్రి గారు పోతన్న గారి నుండీ స్వీకరించారు. 'కలియుగ పోతన'గా పండిత ప్రశంస లందుకున్నారు. సరళమైన, లలితమైన పదాలను ప్రత్యేకంగా వ్రాసుకొని పునశ్చరణ చేసే వారని కూడ అంటారు కొందరు. ఈ పద్యాన్ని వినండి. ఎంత లలితంగా, హృదయానందంగా సాగిందో తెలుస్తుంది.

"ఒత్తుగా పూల గుత్తుల నొత్తు పెట్టి
పై చెఱగు చింపి మెత్తగా ప్రక్క పఱచి
క్రొత్త నెత్తలి రాకుల గూర్చి పేర్చి
ఒత్తు కొనకుండ చేతితో నొత్తి చూచి"
"గాలితాకున జలతారు మేలి ముసుగు
జారె నొక్కింత - అదిగో చిన్నారి మోము

కుంతీ కుమారిని పాఠకులకు గుర్తు చేస్తూ అన్న యీ పదాల్లోని లాలిత్యాన్నీ, మాధుర్యాన్ని మనం మరచి పోలేము.

ప్రాచ్య పండితులు కావ్యంలో రసానికే ప్రథమ స్థానం ఇస్తారు. లలితమైన మధుర మైన శబ్దాలను వాడుట ద్వారా కరుణశ్రీ గారు రసానందాన్ని పాఠకులకు అనంతంగా అందిస్తారు

భావశైలిని శబ్ద శైలితో పోల్చుచూ, విశ్వనాథ వారు భావశైలి శబ్దశైలిలాగే ఉంటుంది. దాన్ని ప్రత్యేకంగా వివేచించ వలసి వుందని తన కావ్యానందంలో అనేక మార్లు అంటారు. కరుణశ్రీ గారి కావ్యాల్లో శబ్దశైలి పలుకు పలుకునా నర్తనం చేస్తూనే ఉంటుంది. శైలి అందరకూ తెలియాలి. సుకుమారంగా ఉండాలి అనేది విమర్శకుల అభిప్రాయము. కవిత్వం భావాశ్రయంగా కన్పించడానికి ఓజస్సు, ప్రౌఢితో బాటు శబ్ద గతమైన సౌకుమార్యమూ, మాధుర్యమూ కూడా ఉండాలిఅను విషయాన్ని బాగా ఎఱిగినవారు కరుణశ్రీ గారు. శబ్దగత నాదశక్తి చేతగానీ, అర్థగత రాయణీయకము చేత గానీ ఏ శబ్దం హృదయమునకు సుఖము దెచ్చునో ఆ శబ్దమ్మును వాడ వలెయును అనేది విశ్వనాథ గారి అభి ప్రాయము. ఈ విషయములో కరుణశ్రీని మొట్ట మొదట చెప్పుకోవాలి.

కరుణశ్రీగారి కావ్యాల్లో శబ్ద లాలిత్యమే కాదు 'రీతి' కూడ చక్కగా గోచరిస్తుంది. ఛందస్సు వేరు. రీతి వేరు. కొందరు అలంకారికుల దృష్టిలో కావ్యమునకు ఆత్మ రీతి. పదముల కూర్పు - అక్షరాల అనుక్రమనిక - ముత్తెపుసరుల్ కూర్చినట్లుగా - శ్రుతి పర్వంగా - లలిత - లయ విన్యాసంగా ఉండే ఎన్నో ప్రజ్ఞల సమాహారం 'రీతి'.

"చక్కనిచుక్క శాక్యకులచంద్రుని
ముందర మందహాసముల్
చెక్కుల జాలువార నిలిచెన్ క్షణ
కాలము స్వామి సన్నిధిన్
మ్రొక్కిన భంగి, శిల్పినవమోహన
రూపము ఫాలరాతిపై
చెక్కిన భంగి, ప్రేమ వివశీకృత నిశ్చల
నిర్నిమేషమై!"

కరుణశ్రీ కావ్యంలోని ఈ పద్యాన్ని కరుణశ్రీ గారు రీతిని పోషించిన తీరుకు ఉదాహరణంగా చెప్పుకోవచ్చు. పై పద్యము మూడవ, నాల్గవ పాదారంభములలోని 'మ్రొక్కిన భంగి', 'చెక్కిన భంగి', అనుపదాలు 'హాయి' నిస్తున్నాయి కదూ?

కావ్యరచనలో రీతి చెప్పుకోదగ్గదే ననీ, కావ్యాత్మ రసమే అనీ వాదించేవారూ, వాక్యం రసాత్మకం కావ్యమ్ అనే వారూ లేక పోలేదు. కరుణశ్రీ రచనల్లో ఈ రీతి, రసాత్మకత గంగా యమునల్లా సంగ మిస్తాయి. ఈ మాటే అంటూ నండూరి రామకృష్ణమాచార్యుల వారు.

'కరుణలేని నరుడు గడ్డి బొమ్మ' అను ధర్మ చక్రము లోని కరుణశ్రీ గారి ఆట వెలది పద్య పాదాన్ని 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అను సిద్ధాంతానికి ఉదాహరణగా స్వీకరించమంటారు.

కరుణశ్రీ గారి కావ్య ఖండికలను చదువుచూ ఉంటే ఏదో ఒక కమ్మని అనుభూతి మనస్సును నింపుతుంది.

లలితపదాలూ, అక్షర రమ్యత కరుణశ్రీ కావ్యాలకు బాహ్యస్వరూపాలైతే - నన్నయభట్టు కాలం నుండి ఈనాటి వరకూ అవిచ్ఛిన్నంగా సాగుచున్న కవితా స్రవంతిలో ఎప్పటికప్పుడు ఆది - అంతాలను

తాకుచూ ఏకధారగా ప్రవహిస్తున్న ఐక్య భావమ్యూ, తీయని తెనుగు తనమూ కరుణశ్రీ గారి కవిత్వానికి అంతరాత్మ. సౌందర్యము యొక్క విరాట్ స్వరూపము 'ఉదాత్తత'. విశ్వ సాహిత్య జగత్తులో ఈ ఉదాత్తతను పోషించి, కృతకృత్యులైన కవులు చాలాతక్కువ. ఆవిషయములో కృతకృత్యులైన.వారిలో కరుణశ్రీ గారొకరు.

ప్రసన్న గంభీర పద లాలిత్యము కరుణశ్రీ కావ్య సంపదల్లో గమనించాల్సిన అంశము. "కరుణశ్రీ కంఠము చతుష్కోటి కంఠకల కలనాధసకలము' 'అంటూ జమ్మలమడక మాధవరాయశర్మ గారు వీరిని ప్రశంసించారు.

కరుణశ్రీ గారి కవిత్వానికి ప్రేరణ పోతన కవిత్వము. 'ప్రేరణనిచ్చె పోతన కవిత్వము నాకును నీకును' - అని స్వయంగా అంటారు తాను పూర్తిచేసిన కరుణశ్రీ కావ్యాన్ని డాక్టర్ ఉండేల మాల కొండారెడ్డి గారికి కృతి యిస్తూ శాస్త్రి గారు.

నవ్య కవుల్లో ముఖ్యంగా పద్య కవుల్లో వీరి రచనలకు లభించినంత ప్రాచుర్యం వేటికీ లభించలేదు. వీరి విజయశ్రీ కావ్యం నలభైకి పైన్నే ముద్రణభాగ్యాన్ని పొందింది. ఇన్నిసార్లు ముద్రణ జరిగిన కావ్యము ఆంధ్ర సాహిత్యములో ఇదొక్కటే. శాస్త్రి గారు కాలానికి అనుగుణంగా మార్పులు చేసేవారు. శాస్త్రి గారు గుంటూరులో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేస్తున్న రోజుల్లో ఒకనాడు ప్రక్క గదిలో ఒక ఆంధ్రోప న్యాసకుడు.

"ఇమ్మన్నాడయిదూళ్ళు భీష్ముడు, గురుండెదో విధిన్ సంధి కానిమ్మన్నాడు, విచిత్ర వీర్య తనయుండేలా విరోధమ్ము పోనిమ్మన్నాడు, అరగంట కర్ణుని మొగ మీక్షించి కాదు పో పొమ్మన్నాడు సుయోధనుండు"... అను వీరి విజయశ్రీ లోని పద్యాన్ని పాఠం చెప్తూ, 'అరగంట కర్ణుని మొగమీక్షించి' - అను దానికి అర్ధగంట సేపు కర్ణుని ముఖం చూచి అని అర్థం చెప్పాడట. ఆ మాటలు విన్న శాస్త్రి గారు ఆహా! ఎంతగా యీనాటి భాషోపన్యాసకుల స్థాయి దిగజారిందీ, ఇకముందు ఇంకెంతకో - అనుకొని, మలి ముద్రణలో 'అరగంట' అనే పదాన్ని 'అటుమీద' అని మార్చినారట. అరగంట అంటే ఇక్కడ అర్ధగంట అని కాదు. అరకంట (సగం మూసిన కన్ను) అని అర్థము. జన సామాన్యములో బాగా వాడుకలో ఉన్న పదం కూడ. తన రచనల విషయములో శాస్త్రి గారికి గల శ్రద్ధ అంతటిది.

వీరి రచనల్లో ఒకటైన ఉదయశ్రీ ప్రథమ భాగం 1944లో ప్రప్రథమంగా ముద్రిత మైంది. నాలుగు సంవత్సరాలు తిరుగ కుండానే రెండవ, మూడవ, నాల్గవ, ఐదవ ముద్రణలు వెంట వెంటనే వెలువడ్డాయి. ఉదయశ్రీకి జరిగిన ఈ సమాదరణ కరుణశ్రీ గారికి ఆనందోత్సాహాలను కలిగించింది. ఉదయశ్రీ ముద్రణకు ముందే 1944లోనే ఇందులోని 'కుంతీ కుమారి' పద్యాలను మహావాది వెంక టప్పయ్య గారు మధురాతి మధురమైన తన కంఠముతో ఆలాపించి, శ్రోతలను ఆనంద తరంగాలలో తేలించారు.

"రక్తపు కూడగాక మనరాజులకున్
ఘృతనూప యుక్తమౌ
భుక్తి లభించునే" విడిచి పుత్తువె
ధర్మము కర్మ సూత్ర సం

సక్తము సృష్టి యెల్ల సహజమ్ములు
తప్పవు చావుపుట్టుకల్
ప్రాక్తన పుణ్య పాపములు ప్రాణులకున్
సుఖదుఃఖ హేతువుల్"

అంటూ శాస్త్రి గారు భారతీయులు అనాదిగా నమ్ముచున్న కర్మ సిద్ధాంతానికి మరింత ఊపునిచ్చారు.

'వినుకృతఘ్నుని మాంసము కుక్కలు తినగా రోయున్' - అని భారతము శాంతి పర్వము. అందుకే మానవుడు ఎప్పుడూ కృతజ్ఞతాభావపూర్ణుడై ఉండాలి.

"సాగిలి మ్రొక్కరా! తెలుగు జాతికి
భాగ్య విధాతయౌ మహా
త్యాగికి "అర్థనూట పదహారులు" జీవిత
సుప్రభాతముల్
యాగ హవిస్సుగా సలిపె! ఆయన
సత్య తపస్సులోన శ్రీ
బాగు ఫలించెరా! తెలుగు బాగుకు
మూలము పొట్టిబాబురా!".

అంటూ తెలుగు వారికి స్వరాష్ట్ర ప్రదాతయైన పొట్టి శ్రీరాములుకు సాగిలి మ్రొక్కమనీ, మానవుడు కృతజ్ఞతతో ఉండాలంటూ హెచ్చరించారు.

"రాధనురా ప్రభూ! నిరపరాధనురా!
అనురాగభావ నా
రాధన మగ్న మానసనురా! కనరా!
కరుణింపరా! మనో
వీధి పదే పదే కలక వేయుచు
నున్నవిరా! పురా రహో
గాధలు - ఈదలేనిక తమోమయ కాల
వాహినుల్" - అంటూ అనురాగ స్నిగ్ధమైన భావనలతో జగత్తుకంతా పిలుపునిచ్చి ఆంధ్ర సాహితీ నందనోద్యానములో పుష్పాలనే కాదు మధుర పుష్పాలను వికసింపజేసిన మహాకవులు - మధుర కవులు - మనసు కవులు 1992 జూలైలో స్వర్గాన్నలంకరించారు.

*(ఆకాశవాణి కడపనుండి 12–2–1997న ప్రసారం)*

**శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయాలూ, ఆర్యవైశ్య ధర్మ సంస్థల సమాఖ్య**
**ఆంధ్రప్రదేశ్. రిజిష్టర్డు నెం. 67 / 1990.**
**వైశ్య ప్రబోధినీ కార్యాలయం, జయనగర్ కాలనీ, కడప-516 002.**

పై సమాఖ్య సర్వసభ్య సమావేశమూ - ఎన్నికలూ రానున్న (1997) జూన్ నెల రెండవ వారములో జరుగుతాయి. పై సమాఖ్యలో ఇంతవరకూ సభ్యత్వము లేని వాసవీ ఆలయాలనూ, ఆర్యవైశ్య ధర్మ సంస్థలనూ ఈ ఎన్నికల్లో పాల్గొనుటకు వీలుగా 25-5-1997లోగా సభ్యత్వ రుసుమును పంపగోరు చున్నాము. 25–5–1997 తర్వాత సభ్యత్వరుసుం పంపనివి ఈ ఎన్నికలలో పాల్గొనుటకు వీలుండదు.

**సభ్యత్వ వివరం :** మహారాజ పోషకులు రూ. 5116/-లు, రాజ పోషకులు రూ. 2116/–లు, పోషకులు రూ. 1116/–లు. సభ్యత్వ రుసుమును పై సమాఖ్య పేర, ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులోనైనా చెల్లునట్లుగా డి.డిని తీసి, పై అడ్రసుకు పంపాలి.

**స్థలదాతలు : వాసవీ గ్రాఫిక్స్, కడప.**

**- పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి,**
**ప్రధాన కార్యదర్శి.**

# రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య నూతనాధ్యక్షులు
# శ్రీ గోపా మచ్చా నరసింహులు



హైద్రాబాద్ నగరం ప్రధాన కార్య స్థానంగా గల రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య సర్వసభ్య సమావేశము - ఎన్నికలు 16-3-1997న జరిగాయి. అనంతపురం గాంధీ రోడ్డులోని శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ఆలయాంతర్భాగమైన శ్రీ శ్రీనివాస పద్మావతీ కల్యాణ మంటపములో జరిగిన సర్వ సభ్య సమావేశములో శ్రీ గోపా మచ్చా నరసింహులు గారు ఈ సమాఖ్యకు నూతన అధ్యక్షులుగా ఎన్నికయ్యారు.

శ్రీ నరసింహులు గారు అనంతపురం వైశ్య ప్రముఖులు శ్రీ గోపా మచ్చా నారాయణ స్వామి గారి కుమారులు. తల్లి శ్రీమతి తిప్పమ్మ. 24-4-1954న వీరు జన్మించారు. ప్రాథమిక, మాధ్యమిక, కళాశాల విద్యలను అనంతపురములోనే అభ్యసించి, అనంతపురములోని ప్రభుత్వ కళాశాల నుండీ 1973లో పట్ట భద్రులయ్యారు.

1976లో శ్రీమతి ఉషారాణిని వీరు తమ జీవిత భాగస్వామిగా స్వీకరించారు. పారిశ్రామిక రంగములో ప్రవేశించి, మంచి అభివృద్ధిని సాధించారు. కీర్తినీ గడించారు తండ్రి చేస్తున్న వ్యాపారానికి మరిన్ని మెరుగులు దిద్ది తండ్రిని మించిన తనయుడనిపించు కొన్నారు.

స్వసంఘ సేవనూ - సార్వజనిక సేవనూ గణనీయంగా సాగిస్తూ - మంచికి మారు పేరుగా నిలిచిన శ్రీ నరసింహులు గారు ఆంధ్ర ప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ విద్యా నిధికి ఉపాధ్యక్షులుగానూ, వి.జి.యస్ ఇంగ్లీషు మీడియం హైస్కూలు కమిటీకి ప్రసిడెంట్‌గానూ, అనంతపురం పాతవూరు బాలుర గవర్నమెంట్ జూనియర్ కాలేజీ కమిటీకి ట్రెజరర్‌గానూ, వాసవీ బాలికల వసతి గృహానికి అధ్యక్షులుగానూ, ఉంటూ ఆయా పదవులకు వన్నె తెస్తూ, వాటి అభివృద్ధికి కృషి చేస్తున్నారు.

అనంతపురం లోని నేచర్ క్లబ్బు ఎక్స్ ఛైర్మెన్ అయిన వీరు వ్యాపారుల సంఘాలైన అనంతపురం డిస్ట్రిక్టు అండ్ ఆయిల్ మిల్లర్స్ అసోసియేషన్ ప్రసిడెంట్ గ్గానూ, రాయల సీమ సీడ్స్ అండ్ ఆయిల్ మిల్లర్స్ అసోసియేషన్‌కు వైస్ ప్రసిడెంట్

గానూ, గోపా రిఫైనరీస్ లిమిటెడ్‌కు మేనేజింగ్ డైరెక్టరు గానూ, బెంగుళూరు లోని గోపా ఇన్‌ఫర్మేషన్ సిస్టమ్స్ ప్రైవేట్ లిమిటెడ్‌కు డైరెక్టరు గానూ, గోపా మచ్చా నారాయణ స్వామి ఆయిల్ కాంప్లెక్స్‌కు మేనేజింగ్ పార్టనర్ గానూ, జి.యస్. ఎస్ ట్రేడింగ్ కంపెని, మచ్చా ఎంటర్ ప్రైజెస్, గోపా బోర్‌వెల్స్‌లలో భాగస్వామిగా ఉంటు న్నారు. అనంత పురములోని శ్రీ వాసవీ సెంట్రల్ స్టోర్సుకు సెక్రటరీగా ఉంటూ ఆ స్టోర్సు అభివృద్ధికి జరుగు కృషిలో బలీయమైన పాత్రను నిర్వహిస్తున్నారు.

అందరికీ ఆరోగ్యం అందుబాటులో ఉండాలని కృషి చేస్తున్న సెంట్ జాన్ అంబులెన్సు అసోసియేషన్, హిందూ కుష్ఠు నివారణ సంఘాలకు జీవిత సభ్యులు గానూ, కడపలోని శ్రీ వాసవీ మెడికల్ రిలీఫ్ సొసైటీకి వైస్ ప్రసిడెంట్ గానూ, అగ్రహారం ఆంజనేయ స్వామి సేవా సమితి వెల్‌ఫేర్ అసోసియేషన్ రూరల్ హాస్పిటల్‌కు కమిటీ మెంబరు గానూ ఉంటూన్న వీరు పాపులేషన్ పాలసీ సెల్, అనంతపురం కేన్సర్ సొసైటీలకు మాజీ అధ్యక్షులుగా ఉండి వాటి అభివృద్ధికి కృషి చేశారు.

అనంతపురములోని శ్రీ త్యాగరాజ సంగీత సభకు జీవిత సభ్యులుగా ఉంటూన్న శ్రీ నరసింహులు గారు అనంత పురం కొత్తవూరు ఆర్యవైశ్య సంఘానికి ఉపాధ్యక్షులుగా, అనంతపురం పాతవూరు లోని శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యా లయ సంఘానికి సలహా దారులుగా, శ్రీ

మి

దేవాలయము, శ్రీ షిర్డీసాయిబాబా ఆలయము, శ్రీ శృంగేరి శారదా శంకర మఠము, అనంత కళా పీఠాల సంఘాలకు కార్య నిర్వాహక వర్గ సభ్యులుగా ఉంటూ వాటి ప్రగతికి తగిన కృషి చేస్తూన్నారు.

విశ్వ సేవా రంగములో విశేష విఖ్యాతిని సంతరించుకొన్న లయన్సు క్లబ్సు ఇంటర్నేషనల్‌కు అనుబంధం సంస్థగా ఉన్న అనంతపురం లయన్సు క్లబ్సులో 1976 నుండీ ఎన్నో పదవులు నిర్వహించి అనేక అంతర్జాతీయ బహుమతుల సైతమూ అందుకొన్న శ్రీ నరసింహులు గారిని 1997 మార్చినెల 16వ తేదీన అనంతపురంలో జరిగిన రాష్ట్ర వైశ్య సంస్థల సమ్మేళనములో - రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య 'పారిశ్రామిక వేత్త' అను బిరుదును ఇచ్చి సత్కరించింది.

**లేఖ**

ఆర్యా!

నమస్కారములు

అంతటా, అవినీతి పెరిగిపోయినది. అసూయ, ద్వేషభావము, స్వార్థము మొదలైనవి మన వైశ్యులలో కూడ పెరిగిపోయినవి. ఐక్యత లోపించినది.

ప్రతి మాసము 'వైశ్య ప్రబోధిని' (మాస పత్రిక) చదువుతూనే వున్నాను.

మీ మీద ప్రచురించబడు విమర్శలు కూడ చూస్తూనే వున్నాను.

వానిని, మీరు లక్ష్యపెట్ట నవసరము లేదు.

మీరు చేయుచున్న సాంఘిక సాంస్కృతిక కృషికి నా ధన్యవాదములు.

భవదీయ

చుండూరి అప్పారావు

రావెల, గుంటూరు జిల్లా

# కలిసి వచ్చే స్థలం, కలిసిరాని స్థలం

సాముద్రిక వాస్తు విదుషీమణి శ్రీమతి బి. లక్ష్మీకాంతమ్మ
ప్రొద్దుటూరు. ఫోన్ : 52239.

కుటుంబ సంబంధి భూగృహాదులు పంచుకొనునపుడు జ్యేష్ఠునకు ఆదిలో; కనిష్ఠునకు తుద్దిలో పంచి యిచ్చుట కద్దు. పశ్చిమమునుండి తూర్పునకు, దక్షిణము నుండి ఉత్తరమునకు విభజన జరగాలని మన పెద్దల కట్టడి. వివాదము రాకుండ పరిష్కరించుకొనుటకు ఈ కట్టడి ఉపక రిస్తుంది. ఇది మంచిదే. కాని, అందుకు భిన్నంగాజరిగితే అరిష్టం కలుగుతుందని దాని ఉద్దేశం కాదు. అన్నదమ్ముల వ్యవహారం అందరికీ అనుభూతమే. అందరూ తమకు ఒకేదిశలో కావాలని పట్టు పట్టితే సమస్య తెగదు. కనుక జ్యేష్ఠానుపూర్వంగా దక్షిణం నుండి ఉత్తరానికి, పశ్చిమం నుండి తూర్పుకు పంచుకొనాలని నిర్దేశించుట జరిగింది. ఈ నిర్దేశం వాస్తు రీత్యా జరిగింది కాదు. తమలో తాము సరదుకొనగలిగితే సోదరులు పెద్ద చిన్న వివక్ష లేకుండ ఏదిశలోనైన ఉండవచ్చు. తప్పు కాదు.

కాలక్రమేణ ఇదొక మూఢాచారంగా బలపడింది. మన యింటికి పశ్చిమంలో కాని, దక్షిణంలో కాని, ఇల్లు కాని, స్థలం కాని, కలిసి వస్తే, పరిగ్రహించుటకు జంకుతున్నారు. ఇది తప్పు.

పశ్చిమ దక్షిణ దిశలే కాదు వాయవ్యాది కోణాలు కలిసి వచ్చినా స్వీకరించ వచ్చు. తప్పు కాదు. ఏ దిశ మనకు అనుకూలమో, ఏదిశ మనకు కలిసి వస్తుందో వాస్తువేత్తల నడిగి తెలుసుకొనుట మంచిది. వాస్తు వేత్తలు అంటే ఈశాన్యం మాత్రం పెంచుకో అనేవారు కారు. వైయక్తికమైన గ్రహాను కూలత గుర్తింపగలవారే వాస్తువేత్తలు. బజారు వాస్తు అందరికీ పొసగదు. ఒకొక్క చోట కొంప ముంచుతుంది.

ఒక ముస్లిమ్ ఉపాధ్యాయుడు గృహనిర్మాణ ప్రయత్నంలో ఉన్నాడు. మా యింటికి వచ్చి సంప్రదించాడు. స్థలం చూచి, అతని సంకల్పానికి అనుగుణంగా ప్లాను ఇచ్చాను. అతని స్థలానికి వాయవ్యంలో మరొకరి స్థలముంది. అది కలిసి వస్తే ఇతనికి వసతి కుదురుతుంది. అది కలిసి రావాలని ఇతని సంకల్పం. నేను "సంకల్ప సిద్ధి రస్తు" అని ప్లాను ఇచ్చాను. ఇల్లు తయారయింది. వాయవ్య దిశలో వుండే వ్యక్తి కూడ ఇల్లు కట్టి కూర్చున్నాడు. కానీ, అతనికి నిలుకడ లేదు.

ఆ స్థలం ఇమ్మని గృహనిర్మాణం చేయక ముందే మన ఉపాధ్యాయుడు అర్థించాడు. మొదట ఇవ్వనన్నాడు. తరువాత రెండు లక్షలిస్తే యిస్తానన్నాడు

ఈ విషయం నాకు చెప్పారు. నేను మా ఉపాధ్యాయునికి ఒకేమాట చెప్పాను. అది మీకు వస్తుంది. మీరు ఆరాటపడ వద్దు. మౌనం వహించండి అన్నాను. ఖాళీస్థలం ఇవ్వ నన్నాడు. తరువాత ఇస్తాను - రెండు లక్షలు అన్నాడు. తరువాత ఇల్లు కట్టి తానే ఇస్తానంటున్నాడు. ఖాళీస్థలమే రెండు లక్షలన్నవాడు, ఇల్లు కట్టి, డెబ్బయి వేలకు ఇచ్చాడు. వస్తుంది అన్నాను. వచ్చింది. ఎవరు బయటివారు పోటీకి రాలేదు. కొనలేదు.

కర్ణాటకము నుండి ఒక పండితుడు వచ్చాడు. ఈయన మన రాష్ట్రంలో ప్రచారంలో వుండే బజారు వాస్తు నేర్చుకొని, అక్కడ ఆఫీసు పెట్టుకొని, ప్లానులిస్తున్నాడు. సొంత విషయం సంప్రదించుటకు నా వద్దకు వచ్చాడు. అతని యింటికి దక్షిణాగ్నేయ దిశలో ఒక ఖాళీస్థలముంది. దీని విలువ లక్షకావచ్చు. అయితే ఆ దిశలో వున్నవాడు మిత్రుడు కనుక మీకు సగము వెలకే అనగా, ఏబదివేలకే ఇస్తాడు. తీసుకోండి అన్నాను. అతడు దిగ్భ్రాంతికి లోనై చాలసేపు కోలుకోలేదు. మీరు ఎపుడైన మా ప్రాంతం వచ్చారా? మా మిత్రు నెరుగుదురా? అని ప్రశ్నించాడు. అయ్యా! ఇదిశాస్త్రం. శత్రుదిశలు, మిత్రదిశలు గుర్తించాలి. ఊరక చెబితే అది శాస్త్రం కాదు. అతడన్నాడు. 'అమ్మా! మా గురువుగారునాకీరహస్యాలు చెప్పలేదు. మీరు చెప్పింది యథార్థం. దక్షిణాగ్నేయ దిశలో నా మిత్రుడున్నాడు. ఆ స్థలం లక్ష విలువ కలది. అయినా, అతడు నాకు సగం వెలకే యిస్తానంటున్నాడు. బజారు వాస్తుప్రకారం ఆలోచించి, ఆగ్నేయం కలుపుకొనడానికి జంకుతున్నాను అన్నాడు. జంకు, కొంకు అక్కరలేదు. మీకేదైన నష్టం వస్తే, పరిహారం నేను చెల్లిస్తాను. ఈ మాట వ్రాసి సంతకం చేసి యిస్తాను. కోర్టులో వేసినా చెల్లుతుంది. అన్నాను.

శాస్త్రానికి ప్రాణముంది. సరిగా ఉపయోగించుకొంటే మేలు కలుగుతుంది. తప్పటడుగు వేస్తే కీడు కలుగుతుంది. మేలు కీడు గుర్తింపగలవాడే శాస్త్రవేత్త.

ఈశాన్య దిశ పెంచాలని తెగ ఆరాట పడేవారున్నారు. వారికి ఆ దిశ పాపగ్రహదిశ అయితే అది కలిసి రాదు. పట్టుపట్టి వంద రూపాయల విలువగల స్థలానికి పదివేలు, లేదా లక్ష వెచ్చించి కలుపుకొంటే, దాని వలన ప్రయోజనముండదు. సరి కదా ప్రళయం తప్పదు. తెలివి గలిగి దానిని కత్తిరించి వేసుకొంటే బాగుపడతారు. లేకుంటే, పుత్రమూలకంగానే ఆస్తి చెదరి పోతుంది. బంగారం ఇల్లు దాటి పోతుంది. అష్టకష్టాలు అనుభవించవలసి వస్తుంది.

కొడుకులు మాట వినకపోతే, ఆర్థికంగా ఇబ్బంది కలిగితే, కాలప్రభావమని భావిస్తే ఎవరేమి చెప్పగలరు? విశ్వ శ్రేయస్సు ఉద్దేశించి మహర్షులు అనుగ్రహించినది శాస్త్రం. పురుషకారంతో చేయదగిన ప్రతి క్రియలు ఉపేక్షణీయములు కావు.

---

వైశ్యప్రబోధిని, ఏప్రిల్ 1997

# దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, తిరుమల


73-ఎ, శాంతోమ్ హైరోడ్, మద్రాసు - 600 028.

ఫోన్ : 4942074, 4941973


## విజ్ఞప్తి

అయ్యా,

మా ట్రస్టు బోర్డువారు నూతనముగా విరాళములు వసూలుచేయుటకు క్రింద ఉదహరించిన ప్రకారము తీర్మానించారు.

## "వైకుంఠ నివాసం" స్కీము - 1995 రు.10,116/- లు.

500 సభ్యులు మాత్రమే. పై సత్రమునందు వీరి జీవిత పర్యంతం సంవత్సరమునకు 3 రోజులు వారికిగాని, వారి అనుమతి పొందిన ఆర్యవైశ్యులకు మాత్రమే రూము ఉచితముగా యివ్వ బడును. ఉచితమనగా కనీస మెయిన్‌టెనెన్స్ చార్జి ట్రస్టుబోర్డువారు అట్టి సమయములలో నిర్ణయించిన ప్రకారము వసూలు చేయబడును. సంవత్సరమనగా ఏప్రిల్ 1-వ తేది నుండి మార్చి 31-వ తేది వరకు, తిరుమల చేరుటకు 10 రోజులు ముందుగా రిసెప్షనిస్టు, దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, రింగ్ రోడ్డు, తిరుమల అనే అడ్రసుకు తెలియపరచవలెను. ఒక తేదీన ఒకరికి మాత్రమే వ్రాసి పంపవలెను. మరొకరికి వ్రాసి పంపకూడదు. ఏ కారణముచేతనైనా ప్రయాణము నిలిపినచో టెలిగ్రామ్ ద్వారా క్యాన్సిల్ అని కనీసం ఒక రోజు ముందు రిసెప్షనిస్టుకు తెలియపరచవలెను, అలా తెలియపరచనిచో ఒకరోజు మీ కోటాలో తగ్గించ బడును. మైనరు దాతలు అంగీకరింపబడరు. ఎవరు ముందు పంపెదరో వారిని నిర్ణీత పరిమితి లోపలే తీసుకోబడును. తర్వాత పంపినవారికి నిర్ణీత పరిమితి దాటితే వారి డి.డి.లు వారికి వాపసు పంపబడును. పూర్తి మొత్తం ఒకేసారి పంపవలెను.

డి.డి.లు పై సంస్థ పేరుతో మద్రాసు ఆఫీసు అడ్రసుకు "అక్కౌంటు పేయి"లో పంపవలెను. అప్లికేషన్ పూర్తిచేసిన దాత సంతకము తోనే పంపవలెను. వారికి బదులు యితరులు చేసిన చెల్లదు. విశేష పర్వదినములలో రిజర్వేషను ముందుగా చేయబడదు. రిసెప్షనిస్టు అప్పటి పరిస్థితులను బట్టి ఖాళీగా వున్నచో యిచ్చెదరు.

ఇట్లు

దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ పరిపాలనా సంస్థ.

**ఆర్.ఆర్.నాధం**

మేనేజింగ్ ట్రస్టీ

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1997 ఏప్రిల్ 20 నుండీ 1997 మే నెల 20 వరకు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | | 27 | 4 | 11 | 18 | |
| సోమవారము | 21 | 28 | 5 | 12 | 19 | |
| మంగళవారము | 22 | 29 | 6 | 13 | 20 | |
| బుధవారము | 23 | 30 | 7 | 14 | | |
| గురువారము | 24 | మే 1 | 8 | 15 | | |
| శుక్రవారము | 25 | 2 | 9 | 16 | | |
| శనివారము | 26 | 3 | 10 | 17 | | |

ఏప్రెల్ 27 :- భరణీకార్తె రాక ప 3-46

ఏప్రెల్ 30 :- 1996-97 సంవత్సరములో తమ ఉద్యోగస్తుల జీతము నుండీ తగ్గించిన ఆదాయపు పన్ను వివరాలకు సంబంధించిన

సర్టిఫికేట్‌ను, ఫారము నెం. 16లో ఇచ్చుటకు ఆఖరురోజు.

(1) 1996-97 ఆర్థిక సంవత్సరములో ఇన్సూరెన్సు కమీషన్ నుండి తగ్గించిన ఆదాయపు పన్ను వివరాలను తెలుపు సర్టిఫికేట్ ఫారము నెం. 16 Aను ఇచ్చుటకు చివరి తేది.

(2) 1996-97 ఆర్థిక సంవత్సరములో డివిడెండ్‌ను తెలుపు అన్యువల్ రిటర్నుఫారము నెం. 26 ను అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు కడపటి రోజు.

(4) 1996-97 ఆర్థిక సంవత్సరములో ఆదాయపు పన్నును తగ్గించ కుండా చెల్లించిన వడ్డీల వివరములను తెలుపు రిటర్ను ఫారము నెం. 27 A ను అందుకుసంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు తుదిరోజు.

(6) 1997 మార్చి నెల జీతములో పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు కడపటి తేది.

మే 1 ప్రపంచ కార్మిక దినము. దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు, సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము.

మే 11 :- కృత్తిక కార్తెరాక ఉ॥ 10-47.

మే 16 :- శ్రీ వాసవీ జయంతి బ్రహ్మంగారి ఆరాధన.

మే 20 :- A - 2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరితేది.

(3) 1996-97 ఆర్థిక సంవత్సరములో ఆదాయపు పన్ను చట్టములోని 194 సెక్షన్ మొదటి షరతు క్రింద ఆదాయపు పన్నును తగ్గించకుండా చెల్లించిన డివిడెండ్ వివరమును తెలుపు రిటర్ను ఫారము నెం. 27 B ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకుచివరి తారీఖు.

(5) పదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1997 మార్చి నెలలో చెల్లించిన జీతము, ఆ జీతములో తగ్గించి పట్టు కొన్న ఆదాయము పన్ను వివరాలనూ తెలుపు స్టేట్‌మెంట్ ఫారము నెం. 21ను అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు చివరి తేది.

(7) 1996 అక్టోబరు 1-1997 మార్చి 31 తేదీలతో ముగియు అర్థ సంవత్సరపు (HALF YEARLY) ఆదాయపు పన్ను వసూళ్ళను తెలుపు రిటర్నులు, ఫారము నెం. 27 EA, 27 EB, 27 EC మరియు 27 ED లను అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు చివరి రోజు.

మే 4 :- డొల్లు కర్తరి ప్రారంభం,

మే 9 :- శుక్ర మౌఢ్య నివృత్తి. మొహరం నెల.

మే 15 :- చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతో బాటు A -2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధిరికి చేర్చుటకు ఆఖరు రోజు.

మే 18 :- పీర్ల పండగ.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.
## (రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూలు)

**టెలిగ్రాం అన్ని చోట్లా : "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"**
**టెలిఫోన్ నెం. - మార్కాపురం : 22740, 22004**
**శ్రీశైలం : 87140, 87114, తిరుపతి : 50030**
**పుట్టపర్తి : 87240, 87440, తిరుమల : 77682**

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

## 1. వాసవీ సత్రం, శ్రీశైలం

150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25.12.62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1251-00లు సమర్పించిన, ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

15×9 రూముకు రూ.30000-00 అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

## 2. వాసవీ నివాస్, పుట్టపర్తి

2 ఎకరముల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనవ ఏర్పాటు చేసినాము. వసతి సత్రమునకు గాను రు.1116-00 సమర్పించిన ; ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,25,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల రూము కేటాయించబడును. 2. రు.2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును. దాత ఫోటో వేయబడును. 3. రు.1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును.

## 3. వాసవీ భవన్, తిరుమల

తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు : 50×12 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయల్లు విరాళము నొసగు దాతలకు రూము డోనార్ల మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు రూము యివ్వబడును. 14 అంకణములు పరిమితం.

రు.2116-00 సమర్పించిన వారి డబ్బు వసతి సత్రమునకు ఉపయోగింప బడును.

అన్నదానమునకు రు.100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన సం॥లో ఒక పర్వ దినం రోజునను, రు.5116-00 సమర్పించిన పర్వదినం కాని రోజున సం॥లో ఒక రోజు జరుపబడును.

## 4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టిట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

ఒక భోజనహాలు నిర్మాణంచేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రికుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము. 4.10.95 నుండి నిత్య భోజనములు, వసతులు తాత్కాలికముగా ఏర్పాటు చేసినాము. వైశ్య యాత్రికులు ఉపయోగించుకొన కోర్తాము.

### తిరుపతి వసతి సత్రమునకు విరాళములు

రు.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. ఫొటో వేసి, నాపరాయిపైన వారి పేరు చెక్కించ బడును.

రు.10000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. ఫొటో వేసి నాపరాయిపైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రు.5000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రు.1116/-లు సమర్పించినవారికి వారి ఫోటో వేసి వారి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల పర్వదినం రోజున అన్న సంతర్పణ, ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును. రు.1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థినిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూలధనం ఏర్పాటుచేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారు గదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైనా మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్ష రూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి సంవత్సరములో 60 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116-00 సమర్పించినవారు మహారాజ పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయిపైన చెక్కించబడును.

రు.5116-00 సమర్పించిన రాజపోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116-00 సమర్పించిన వారు పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయిపైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116-00 సమర్పించిన వారు సభ్యులు. వీరి ఫోటో, వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCETలో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ చతుర్థ మహా క్రతువు 27.4.97 నుండి 5.5.97 వరకూ విజయవాడ శ్రీ భావనారాయణ కాలేజీలో జరిపించుచున్నాము.

పై యజ్ఞము జరుగు 9 రోజులు, 108 హోమ కుండములతో కుండమునకు 4గురు దంపతుల ప్రకారం చేయబడును. ఈ సందర్భములో ప్రతి రోజు ఉదయం 6-8 వరకు సామూహిక గీతాపారాయణములు, ప్రతి రోజు ఉదయం 8-12 వరకు - మొదటి రోజు శ్రీమన్నారాయణుని దర్శన యజ్ఞం, రెండవరోజు రామకృష్ణ యజ్ఞం, మూడవరోజు అష్టలక్ష్మి యజ్ఞం, నాల్గవరోజు శ్రీ లక్ష్మీ వెంకటేశ్వరస్వామి యజ్ఞం, ఐదవ రోజు పుత్రకామేష్టి యజ్ఞం, ఆరవరోజు రుద్రయజ్ఞం, ఏడవ రోజు సప్తశతి, దుర్గాయజ్ఞం, ఎనిమిదవ రోజు శ్రీ లలితాదేవి యజ్ఞం, తొమ్మిదవరోజు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ యజ్ఞం, పూర్ణాహుతి జరుపబడును. మధ్యాహ్నం 12 నుండి 4 గంటల వరకు ఆధ్యాత్మిక కార్యక్రమములు, 4 నుండి 7 వరకు ప్రఖ్యాతి గాంచిన మహాత్ములచే ఉపన్యాసములు, 7-8 వరకు లక్ష దీపాలంకరణలు, 8-10 ఆధ్యాత్మిక ప్రదర్శనలు జరుపబడును. యజ్ఞము చేయు వారందరికీ ఉచిత వసతి, ఉపాహార, భోజనములు, యజ్ఞమునకు కావలసిన వస్తువులన్నియు కమిటివారు ఉచితముగా యివ్వగలరు.

## ఇందులకై సమర్పించవలసిన విరాళములు

1. రు.315-00 సమర్పించినవారు 9 రోజులలో ఒక రోజు ఒక కుండమునకు ఒక ప్రక్క కూర్చొని యజ్ఞము చేయవచ్చును.
2. రు.1116-00 సమర్పించినవారు ఒకరోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. వీరి పేరుతో 100 మందికి అన్నదానం జరుపబడును. యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

రు.2500-00 సమర్పించినవారు ప్రతి సంవత్సరము జరుపు యజ్ఞములో ఒక రోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

ఇంకా బియ్యం, పప్పు వగైరా వస్తువులు విరాళములుగా యివ్వవచ్చును.

గమనిక : యజ్ఞం టిక్కెట్లు కావలసినవారు ముందుగా DDలు పంపి ఏ రోజు అయినది వ్రాసి పంపి సీటు రిజర్వు చేయించుకొన కోర్తాము.

ఉత్తర ప్రత్యుత్తరములకు

**మూర్తి వెంకటేశ్వర్లు,**

సెక్రటరీ, వాసవీ సత్ర సముదాయం, 3-308, మార్కాపురం - 523 316.

**N.B. :** పై సత్రముల పేరుతో - DDలు కాని, చెక్కులుకాని ఆయా సత్రములకు పంపకోర్తాము లేదా మార్కాపురం అడ్రసుకైనా పంపవలెను. ఎవరు అడిగిననూ డబ్బు యివ్వవద్దు. అకౌంటు పేయీ చెక్కులు, DDలు యిచ్చేది. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# 15వ, రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య సమ్మేళన విశేషాలు

"తాను చేసిన మంచిపని అది ఎంత చిన్నదైనా, ఎంత పెద్దదైనా - అందుకు తగిన గుర్తింపు రావాలి" - అనుకోవడం మానవ సహజం. ఈ ప్రధాన సూత్రం ఆధారంగా ఏర్పాటైందే రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య.

ఈనాటి ఆంధ్రప్రదేశ్ ఆర్య వైశ్య మహాసభకు మలి రూపమైన (తొలిరూపం నిజాం రాష్ట్ర ఆర్యవైశ్య మహాసభ) హైద్రాబాద్ రాష్ట్ర ఆర్యవైశ్య మహాసభ సంస్థాపకులూ, రాష్ట్రములోని పలు వైశ్య సంఘాల వ్యవస్థాపకులూ శ్రీ కె.సి. గుప్తగారి మస్తిష్కంలో మెదలిన ఒక మంచి ఆలోచనకు సముచిత రూపము ఈ రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య.

ఈనాడు నేనూ ఆర్యవైశ్య మహాసభ అధ్యక్షుణ్ణి అని ఘనంగా చెప్పుకొంటున్నారో, అట్టి ఆంధ్ర ప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభకు స్థాపకుడై, జీవితాన్ని అంతాకూడ వైశ్యుల అభ్యున్నతికే మీదు పట్టిన శ్రీ కె.సి. గుప్తగారు మహాసభాధ్యక్షులు కావాలనుకుంటే అందుకు ఈనాటి మహాసభ నాయకులు 'కాదుపో' అన్నారు.

గుప్తగారు వైశ్య సమాజాభ్యున్నతికి చేసిన కృషిలో వెయ్యిలో ఒక వంతుకూడ కృషి చేయని వారు మహాసభాధ్యక్షులయ్యారు కూడ.

గుప్తగారి విషయము లోనూ, మహాసభాధ్యక్ష పీఠాన్ని అధిరోహించిన కొందరి విషయములోనూ వైశ్యులు తప్పక గుర్తించు కోవాలి అను అభిప్రాయముతోనే పైరెండు అంశాలనూ అప్రస్తుతమైనా - ఇక్కడ ఉటంకించ వలసి వచ్చింది.

దాన ధర్మాది సత్క్రియ లొనరించిన వైశ్య సోదరులనూ - వైశ్య సంఘానికి మిక్కిలి సేవ చేసిన వారినీ గుర్తించి - అందుకు తగిన రీతిగా బిరుదులూ, సన్మానాలు చేసి వారి కృషికి తగిన సార్థకతను కల్గించుటలో భాగంగా - ప్రతి యేడూ పై రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య రాష్ట్రములో ఏదో ఒక పట్టణములో సమ్మేళనాన్ని జరిపి తన యీ కార్యక్రమాన్ని నిర్వహిస్తూంది.

ఈ సమాఖ్య తన 15వ రాష్ట్ర వైశ్య సంస్థల సమ్మేళనాన్ని 16-3-1997న అనంతపురం పట్టణము గాంధీ రోడ్డులోని శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ఆలయాంతర్గత శ్రీనివాస పద్మావతీ కళ్యాణ మంటపములో అత్యంత రమణీయంగా - కమణీయంగా - సంస్మరణీయంగా - వైభవోపేతంగా నిర్వహించింది.

ఆనాటి ఉదయం 11 గంటలకు జరిగిన ఈ సమ్మేళనోత్సవ సభకు రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య ప్రస్తుతాధ్యక్షులు, నిర్మాణరత్న శ్రీ మేడా నరసింహులు గారు అధ్యక్షత వహించారు.

సకలాభరణ భూషితయై, పట్టు పీతాంబరముతో కన్నుల పండుగ జేస్తూ, సభావేదిక ముందు కొలువు దీఱిన శ్రీ

వాసవీ దేవి ముఖమునులో ఏర్పాటు చేసిన జ్యోతిని మాజీ మంత్రి వర్యులు శ్రీ కె. రోశయ్య గారు వెలిగించుటతో సభా కార్యక్రమము ఆరంభమైంది.

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్య వైశ్య ధర్మ సంస్థల సమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్, ప్రొద్దుటూరు పురపాలక సంఘాల అధ్యక్షులూ, 'ప్రజాబంధు', 'దానశీల' శ్రీ కామిశెట్టి సుబ్బరావు ఆంధ్ర ప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ మాజీ అధ్యక్షులు శ్రీ కాసం శెట్టి రాధాకృష్ణయ్య, సుప్రసిద్ధ పారిశ్రామిక వేత్తలు శ్రీ టి.జి. వెంకటేశు, మరో ప్రసిద్ధ పారిశ్రామిక వేత్త డాక్టర్ సుంకు బలరాం, అనంతపురం పట్టణ ఆర్యవైశ్య సంఘాధ్యక్షులు శ్రీ గొంది పాండురంగయ్య శ్రేష్ఠి, సమ్మేళనోత్స ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ గోపా మచ్చా నరసింహులు, రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య కార్యదర్శి శ్రీ జి. వెంకట రమణయ్య, ఈ సమాఖ్య వ్యవస్థాపకులూ, స్వాతంత్ర్య సమర యోధులూ శ్రీ కె.సి. గుప్త, ప్రభృతులు వేదికను అలంకరించారు. బాపట్ల ఆర్య వైశ్య సంఘం ఉపాధ్యక్షులు లయన్ నాళం వెంకట శ్రీనివాసమూర్తి గారు ఈ కార్యక్రమములో సంచాల కులుగా వ్యవహరించారు. ఈ సమాఖ్య కార్యదర్శి శ్రీ జి. వెంకట రమణయ్య గారు కార్యదర్శి నివేదికను సమర్పించారు.

అనంతపురం పురపాలక సంఘం మాజీ అధ్యక్షులు శ్రీ మేడా రామయ్య శ్రేష్ఠి గారికి 'దానశీల' అనీ - అనంతపురం వాస్తవ్యులు శ్రీ జి.వి. సుబ్బయ్య శ్రేష్ఠి గారికి



సమ్మేళనంలో సన్మానాన్నందు కొనుచున్న ఈ పత్రికా సంపాదకులు లక్ష్మీకాంతం శ్రేష్ఠి. సమాఖ్య స్థాపకులు శ్రీ కె.సి. గుప్త, సమాఖ్య అధ్యక్ష, కార్యదర్శులు శ్రీ మేడా నరసింహులు, శ్రీ జి. రమణయ్యగారలు.

'సంఘోద్ధారక' అనీ - గుత్తి పుర ప్రముఖులు శ్రీ కె. పద్మనాభయ్య గారికి 'దానశీల' అనీ - హిందూపురం పురపాలక సంఘం మాజీ అధ్యక్షులు శ్రీ యన్. దశరథ రామయ్య గారికి 'దానశీల' అనీ - నంద్యాల పురప్రముఖులూ, పారిశ్రామిక వేత్తలూ శ్రీ గెలివి కొండయ్య గారికి 'దానశీల' అనీ - మదన పల్లె పురప్రముఖులు శ్రీ బింగి శ్రీ రామయ్య గారికి 'దానశీల' అనీ - ప్రొద్దుటూరు వైశ్య ప్రముఖులు శ్రీ గాధం శెట్టి చెంచయ్య శ్రేష్ఠి గారికి 'దానశీల' అనీ అనంతపురం పుర ప్రముఖులూ, మాజీ శాసన మండలి సభ్యులూ శ్రీ మేడా సుబ్బయ్య శ్రేష్ఠి గారికి 'సేవారత్న' అనీ - ఆదవేణి పుర ప్రముఖులు శ్రీ విట్టా కృష్ణప్ప శ్రేష్ఠి గారికి 'సేవారత్న' అనీ - నెల్లూరు వైశ్య ప్రముఖులు లయన్ వై. శ్రీనివాసరావు (సురేష్) గారికి 'సేవారత్న' అనీ - అనంతపురం వైశ్య ప్రముఖులూ ఆహ్వాన సంఘాధ్యక్షులూ శ్రీ గోపా మచ్చా నరసింహులు గారికి 'పారిశ్రామిక రత్న' అనీ, ప్రొద్దుటూరు పుర ప్రముఖులు శ్రీ వల్లం కొండు సత్యనారాయణ శ్రేష్ఠి గారికి 'వాణిజ్య రత్న' అనీ - ఈ ఉత్సవ సభలో ఈ సమాఖ్య బిరుదులను ఇచ్చింది. మాజీ మంత్రి వర్యులు శ్రీ కె. రోశయ్య గారి చేతుల మీదుగా పై వారలకు ఈ బిరుదుల ప్రదానం జరిగింది.

ప్రొద్దుటూరు పుర ప్రముఖులూ, సాహితీ బాంధవులూ, శ్రీ దోమా వెంకట స్వామి గుప్త సాహిత్య పీఠం అధ్యక్షులూ శ్రీ జూటూరు రమణయ్య, ప్రొద్దుటూరు ఆర్యవైశ్య సభాధ్యక్షులూ, మాజీ శాసన సభ్యులూ శ్రీ కొప్పరపు సుబ్బరావు, కదిరి



*సమ్మేళనములో మాజీ మంత్రివర్యులు శ్రీ కె. రోశయ్య గారిని సత్కరిస్తున్న సమ్మేళన ఆహ్వాన సంఘాధ్యక్షులు 'పారిశ్రామిక వేత్త' శ్రీ గోపా మచ్చా నరసింహులు గారు, వారు, ఈ సమాఖ్య అధ్యక్షులు 'నిర్మాణరత్న' శ్రీ మేడా నరసింహులు గారు.*

పట్టణ ప్రముఖులు శ్రీ మట్టా పాండు రంగయ్య, చిత్తూరు వైశ్య ప్రముఖులు శ్రీ వెంకటేశ్ పెరుమాళ్, అనంతపురం జిల్లా ఆర్యవైశ్య సంఘం గౌరవాధ్యక్షులు శ్రీ కె. రామాంజనేయులు, అనంతపురం పుర ప్రముఖులు శ్రీ గోపా మచ్చా నారాయణ స్వామి మొదలగు వారలను ఈ సమాఖ్య, ఈ ఉత్సవ సభలో ఘనంగా సత్కరించింది.

ఈ పత్రికా సంపాదకులు 'సంఘోద్ధారక' 'వైశ్య భూషణ ' శ్రీ పి. లక్ష్మీ కాంతం శ్రేష్ఠి గారికి ఈ సమాఖ్య వ్యవస్థాపకులు శ్రీ కె.సి. గుప్తగారు ఈ సమాఖ్య తరపున సత్కరించి, అవార్డు క్రింద వెయ్యి రూపాయలనగదును బహూకరించారు.

బిరుద స్వీకృతులందరికి, సత్కార గ్రహీత లెల్లరుకూ కూడ విలువైన జ్ఞాపికలనూ, శాలువలనూ, ధృవ పత్రాలనూ ఈ సమాఖ్య అధ్యక్షులు శ్రీ మేడా నర సింహులు, కార్యదర్శి శ్రీ జి. వెంకట రమణయ్య గారలు ఇచ్చారు.

వేదికను అలంకరించిన వారందరినీ కూడ విలువైన శాలువ, జ్ఞాపిక, ధృవ పత్రాలతో ఈ సమాఖ్య అధ్యక్ష కార్య దర్శులూ, ఆహ్వాన సంఘాధ్యక్షులూ సత్క రించారు.

కార్యకర్తలు సభాస్థలిని యావత్తూ మహామనోహరంగా -నయనానందకరంగా అలకంరించారు. వేదికను అత్యంత రమణీయంగా తీర్చి దిద్దారు. తమలోని కళానురక్తిని నిర్వాహకులు అడుగడుగునా చూపించారు. రంగాలంకరణకు ఏదైనా బహుమతి అంటూ ఉంటే ఆ బహుమతి వీరికి తప్పక లభిస్తుంది.

హైద్రాబాద్ ప్రధాన కార్యస్థానంగా గల ఈ సమాఖ్య నిర్వాహకులు తమ అనంతపురం పట్టణానికి వచ్చి చేస్తున్న కార్యక్రమానికి సంతసించిన అనంత పురం (పాతవూరు) ఆర్యవైశ్య సంఘాధ్యక్ష, కార్య దర్శులూ, కార్యవర్గ సభ్యులూ, పలువురు ముఖ్యులూ ఈ కార్యక్రమాన్ని తమ స్వంత కార్యక్రమంగా భావించి తమ నిండు సహకారాన్ని అందించి ఇతర ఆర్యవైశ్య సంఘాల వారికి మార్గదర్శకులయ్యారు.

సభా వలపక్షాన్ని పాటించడము అనేక ఆర్యవైశ్య సభల్లో కొట్టి వచ్చినట్లు కన్పించడం చాలా సహజము. ఈ సమాఖ్య వారు సభా వలపక్షానికి ఆవంత కూడ అవకాశం ఇవ్వక పోవడం ఈ కార్య క్రమములో గమనించాల్సిన అతి ప్రధాన అంశము. ముఖ్య అతిథులకూ - బిరుదు స్వీకృతులకూ, సత్కార గ్రహీతలకూ అందరికీ గూడ ఒకే రకమైన జ్ఞాపికలూ, శాలువలూ, ధృవ పత్రాలూ ఇచ్చారు.

చిన్న, పెద్ద అను తేడా ఎక్కడా కనిపించలేదు.

తమంత తామే ఆహ్వానించి, ఆ ఆహ్వానంపై అరుదెంచిన వారిని వేదికపైకి కూడ పిలిచి, ఆ తరువాత వారి వారి స్థాయిని మరీ మరీ జాగ్రత్తగా బెత్తెడు, జానెడు, మూరెడు, బారెడు అను కొలతలతో నిర్ణయించి, అందుకు తగిన విధంగా జ్ఞాపికలనూ, శాలువలనూ కూడ ఇచ్చే పద్ధతి ఈనాడు వైశ్య సభల్లో అత్యధికంగా కనిపిస్తుంది. ఈ సభా కార్యక్రమములో ఈ సమాఖ్య నిర్వా హకులు పాటించిన సమాన స్థాయినీ, పద్ధతినీ ప్రతి ఆర్య వైశ్య సంఘాలూ తప్పక గుర్తించడము అవసరం. సభావల పక్షము అత్యంత పాపహేతువు.






# Sri Sai Sadan (MEDA'S GUEST HOUSE)

**SBI - Hanuman Temple Main Road, Puttaparthi - 515 134.**
**Anantapur Dist. (A.P.) India.**
**Ph : 08555-87507, 87508 Fax : 08555-87508**

1. Every suit is provided with Pantry, Drawing cum Dining Hall, Bed Room, Sitout and attached toilet.
2. Every suit is equipped with Fridge, Telephone, Geyser.
3. Spacious Bhajan/Meditation Hall on the top floor is provided for devotees.
4. Air-conditioned Suits are also available.
5. A pure vegetarian Restaurant with South Indian, North Indian & Continental dishes.
6. STD, ISTD, FAX Facilities.
7. A Doctor on call.
8. Safety Lockers.
9. Ample parking space.
10. Prompt service and best facilities at affordable Tariff.

**Registered Office :**
**6-3-609/161, Anandnagar Colony, Hyderabad - 500 004.**
**Phones : Off : 3394320, Res : 3313796 (STD : 040) Fax : 394320**

**ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభను జాగృతము చేయుటకు యీ పత్రిక ద్వారానూ, వ్యక్తిగతంగానూ తాను చేసిన సుదీర్ఘ కృషికి గుర్తుగా, మైలురాయిగా ఉండాలన్న భావముతో ఈ పత్రికాధిపతి ఒక దశలో ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహా సభాధ్యక్ష పదవిని గురించి ఆలోచించాడు. ఈ సందర్భంగా శ్రీ జూటూరు వేమయ్యగారికి వ్రాసిన లేఖల్లో ఒకటి. మహాసభ ఈనాడు ఈ స్థితికి చేరుకోడానికి తొలినుండీ ఈ పత్రికాధిపతి న్విహించిన బలమైన పాత్రనూ, కార్యకర్తలకు జరుగు అన్యాయాన్నీ గుర్తు చేయుటకు మాత్రమే ఈ లేఖా ప్రచురణ. ఏ వ్యక్తినీ కించపరచుటకు కాదు. ఎవరికైనా అట్టి భావంకలిగితే వారిని మన్నించ మంటున్నాం.**

తేదీ : 14-02-1997

**శ్రీ జూటూరు వేమయ్య గారికి**

**ప్రొద్దుటూరు.**

ఆర్యా!

కొండాపురములో - జనరల్ కౌన్సిల్ మెంబర్లలో నా పేరు పంపుటలో మీరు తెచ్చిన నిబంధనావళి ప్రసక్తీ, ఆ తరువాత ఒక స్థానాన్ని ఖాళీగా పెట్టడమూ - నాకు చాలా ఆశ్చర్యాన్నీ, ఆవేదననూ కలిగించింది. శ్రీ వేమయ్య గారు ఎంత త్వరగా గతాన్ని విస్మరించారు అని అనిపిస్తూంది.

మీరు పదవులు కావాలనుకున్నపుడు - నేనూ ఇట్లే వ్యవహరించి ఉంటే అంత సులభంగా మహాసభ అధ్యక్షులయ్యే వారా?

కడపలో జరిగిన ప్రప్రథమ ఆర్యవైశ్య యువజన సమ్మేళనా కార్యక్రమములో నేను మీకు స్థానాన్ని కల్పించక పోతే మీకు మహాసభతో పరిచయము కలిగేదా? శ్రీ 'శయ్య గారి దృష్టికి వచ్చే వారా!

చాలా కాలం నుండీ మీకు ప్రొద్దుటూరులో పెద్ద వ్యతిరేక వర్గము ఉంది. మీరు యువజన సంఘాల సమాఖ్య అధ్యక్షులైనపుడు వారంతా నన్ను ఏ విధంగా ఎత్తి పొడిచారో? మీకు తెలియదు.

ఇప్పుడు నా విషయం వచ్చేటప్పటికి నియమావళి ప్రసక్తి తెస్తున్నారు. "ఏ సభ్యుడైనా వరుసగా మూడు కార్యవర్గ సమావేశాలకు హాజరు కానిచో తన సభ్యత్వమును కోల్పోవును" అని కదా నియమావళి. ఆ నియమావళిని ఖచ్చితంగా పాటిస్తే ఎందరు కార్యవర్గ సభ్యులు అర్హులౌతారు. అధ్యక్ష పదవికి మీ అభ్యర్థిత్వం పరిశీలనకు వచ్చినపుడు కొందరు ముఖ్యులు ఇదే అభ్యంతరాన్ని లేవదీశారు. వేమయ్యగారు ఎన్ని కార్యవర్గ సమావేశాలకు హాజరయ్యారో మినిట్ బుక్ చూచి చెప్పండి అని గట్టిగా నిలదీశారు కూడ. అప్పట్లో మేమూ ఇప్పటి మీవలె మాట్లాడి వారితో శ్రుతి కల్పి ఉంటే ఏమయ్యేది?

నియమావళిని మీరు గట్టిగా చెప్పు కొంటున్నారు. న్యాయ స్థానాల్లో సవాలు చేస్తే, మీరు మార్చిన నియమావళి నిలుస్తుందా?

కర్నూలు గుప్తగారు శ్రీ రోశయ్య గారి వద్దకు వచ్చి తన అభ్యర్థిత్వాన్ని తెల్పినపుడు, నేను శ్రీ రోశయ్య గారి వద్దనే ఉన్నాను. శ్రీ రోశయ్య గారు 'ఆలోచిద్దాం' అన్నారు. వెంటనే నేను "అన్నా! మనము పదవుల విషయములో సీనియారిటీని పరిగణనకు తీసుకుంటున్నాము కదా! గుప్త గారి కన్నా వేమయ్య గారు సీనియర్. ఆ మాటే చెప్పండి ఇప్పుడు" అని శ్రీ రోశయ్య గారికి చెప్పాను. మిమ్ము వ్యతిరేకించే అనేకులతో నెత్తురు పూసుకొని గట్టిగా వాదించాను.

మీరు యువజన సంఘాల సమాఖ్యకు అధ్యక్షులైన తర్వాత ఒక సంవత్సరానికి విజయవాడలో రాష్ట్ర వైశ్య సమ్మేళనము జరిగింది. ఆ సమ్మేళనానికి మీకు ఆహ్వానం కూడ పంపలేదు. కీ॥ శే॥ పచ్చిపులుసు వెంకట సుబ్బరావు గారితో తగాదాపడి ఆహ్వానం పంపే ఏర్పాటు చేశాను.

శ్రీ రోశయ్య గారు అధ్యక్షులైన లగాయతు చాలా వత్సరాలు మహాసభకు నాతో ఎన్నో పనులు చేయించారు. మీరు కోరినందున విజయవాడ సభల్లో మీ వెంటే దాదాపు పది రోజులు విజయవాడలో ఉన్నాను. మీ ప్రధానకార్యదర్శి హయాములో వరంగలు సభలకు అధ్యక్షో పన్యాసం నాతోనే వ్రాయించారు. రెండు రోజులు హైద్రాబాద్‌లోని ద్వారకలో ఉండి వ్రాయించి వచ్చాను నా ఖర్చులతో. ఆనాటి నా ఆర్థిక స్థితి ఏమిటి?

ఇవి ఎందుకు చేశాను? మీ మీదగల గౌరవముతో. మహాసభలోకి నా తరువాతే మీరు వచ్చారు.

"మమ్మందరనూ ఈ రంగంలోకి మళ్ళించినది నీవనేది మరచిపోలేము ఎవ్వరమూ?" - అనీ,

"వైశ్య జాతిని జాగృతం చేయుటలో నీ పాత్రను గురించి నాలుగు మాటలు ఉత్తరంలో వ్రాస్తే సరిపోతుందా? చాలదు. మహాసభలో భాద్యతలు నేను, **శ్రీ వేమయ్య** తదితరులు తీసుకొనుటలో ప్రేరణ నీదే. తరువాత మిగిలిన వారిది '- అనీ,

"మహాసభ కార్యక్రమం ప్రారంభింప చేసినది నీవు కడపలో. మంచి మనసుతో చేశావు. మంచిగానే జరుగు చున్నది" అనీ ✦ శ్రీ రోశయ్య గారు వ్రాసిన సందర్భా లున్నవి. ఆ లేఖల నకళ్ళను దీనితో పంపు చున్నాను.

మహాసభతో నాకున్న అను బంధము ఎంత సుదీర్ఘమైందో మీకు తెలియదా? శ్రీ జి. నారాయణ శ్రేష్ఠి గారు మహాసభకు అధ్యక్షులుగా ఉన్నప్పటి నుండే మహాసభతో నాకు అనుబంధం ఉంది. అప్పుడూ మహాసభకు సభ్యత్వమూ ఉంది. నియమావళీ ఉంది. అనాటి నుండీ ఈనాటి వరకూ మహాసభ కార్య నిర్వాహక వర్గములో నా పేరు ఏదో ఒకస్థానంలో ఉంటూనే ఉంది. మరి ఎందుకు ఈ అభ్యంతరము. ఏదో మెలిక పెట్టుటకు తప్ప. మీరు మహాసభకు కార్యదర్శు లైనపుడు మీరు మహాసభలో రూ.101/-లు చెల్లించిన సభ్యులా?. ఇప్పుడు మీరు వ్యవహరిస్తున్నలాగే అనాడు నేనూ వ్యవహరించి ఉంటే మీరు అంత సులువుగా అధ్యక్షులు కాలేరు. మీరు

✦ ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ ఈనాడు ఈ స్థితిని చేరుకోడానికి ప్రధాన కారకులూ మహాసభకు ఈనాటికీ ఎదురులేని నాయకులూ శ్రీ రోశయ్యగారు

అంగీకరించక పోయినా ఇది ముమ్మాటికి సత్యము. సత్యము ఎప్పుడైనా ఒకప్పుడు బహిర్గతము కాకపోదు.

కార్యవర్గ సమావేశం 28/4/77 వేయమన్నాను. తప్పక రాగోరెద".

నీవు శ్రీ కె.సి. గుప్తతో "నన్ను ఈసారి కార్యవర్గములో వేయకండి" అన్నావట. ఇదేమిటి? ఒక వైపు అందరమూ కలిసి ఒక సంవత్సరం శ్రమ చేద్దామని ప్రతి నిత్యం అనుకుంటున్నాను. నీవే ఇలా ఆలోచించడం మంచిది కాదనీ శ్రీరోశయ్య గారు 1977లో వ్రాసిన లేఖల నకళ్ళనూ ఇందుతో పంపుచున్నాను. మహాసభ అధ్యక్ష పదవికి ఇంతకన్నా అర్హత కావాలా?

"లక్ష్మీకాంతం చాలా స్వతంత్ర భావాలు కలవారు" అని ఒక మిత్రునితో మీరు అన్నారట. మహాసభ అధ్యక్ష పదవి నధిష్ఠించాలనుకొనే వానికి ఇది అర్హతా? లేక,

"విశ్వనాథగుప్త గారిని అధ్యక్షుణ్ణి చేస్తే నేను వెనుక నుండీ నడిపిస్తాను" అని పడుచూరు అంటున్నాడు. అంటే రెండు కుర్చీలు వేస్తారా! ఇది మీ దృష్టిలో మహాసభ అధ్యక్ష పదవికి అర్హతా?

మీరు యువజన సంఘాల సమాఖ్య అధ్యక్షులైన తర్వాత చీరాలలో జరిగిన సభా కార్యక్రమము విజయవంతమై మీకు జేజేలు లభించినపుడు, నన్ను అభినందించిన విషయాన్నీ, అప్పట్లో అన్న మాటలనూ మీరు మరచి పోయారా? మరచి పోవడాన్ని ఏమంటారో మీకు తెలుసు.

ఇప్పటికీ నాకున్నంతగా పరిచయాలు మీకు లేవు.

మహాసభకు నిన్ను దూరం చేసింది మీ వేమయ్యగారే - అని శ్రీ రాధాకృష్ణయ్య గారే స్వయంగా నాతో అన్నారు. "నీవేమో వేమయ్య గారిని మా వేమయ్య అంటూ గౌరవిస్తూ ఉంటావా? ఆయన నీమీద చేదు కాయలు కోస్తూనే ఉంటారు" అని మీ వూరి వారే పలువురు నాతో అన్నారు. నేను కర్మ సిద్ధాంతాన్ని నమ్మిన వాణ్ణి. అమ్మను నమ్ముకొన్నవాణ్ణి. వాటిని పట్టించుకోను. పట్టించుకొని ఉంటే వైశ్య వైజయంతికలో మీ పరిచయం ఉండేదే కాదు. వైశ్య వైజయంతిక చదివినంత వరకూ మీకు ఆ విషయము కూడ తెలియదు. దీన్ని ఏమంటారు? మీ మీద గల గౌరవముతో కాదా? అలాంటప్పుడు నా విషయం వచ్చినపుడు మీరు స్పందించ వలసిన తీరు ఇదేనా? వైశ్య వైజయంతిక లోని మీ పరిచయాన్ని చదివి ప్రొద్దుటూరు పట్టణ ప్రముఖులొకరు "మీరు వైశ్య వైజయంతికలో మీ వేమయ్య గారిని పరిచయం చేసిన తీరును గమనించాను. మనస్ఫూర్తిగా వ్రాసినట్లుంది అన్నారు. ఆయన సామాన్యులు కూడ కారు. మంచి శ్రీమంతులు. విషయ వివేచనం చేయడములో కూడ గట్టివాడు. మనస్సులో ఉన్న భావాన్ని గట్టిగా వెలుపలికి చెప్పగల సుమనస్వి. ఆధ్యాత్మిక వేత్తలమనుకునే వారలలో 'నా' అను అహం ఉండరాదు. అనీ, మనస్సులో విషాన్ని దాచుకొని తీయగా మాట్లాడడం తగదు అనీ నమ్మేవాడు. దాన్నే ఆచరించేవాడు. నీ మీద వేమయ్య గారికి వెలుపల చెప్పేంత అభిప్రాయము లేని వారైనా ఆయన్ను

పరిచయం చేసిన నీ తీరు నీ గొప్పతనానికి నిదర్శనము అని కూడా ఆ సందర్భంగా ఆయన అన్నాడు.

కడపలో నా పై నిష్కారణ ద్వేషమూ, అసూయా ఉన్న ఒకరిద్దరు నా పై వ్యతిరేకంగా చెప్పినట్లూ, పేరు పంపవద్దు అని చెప్పినట్లూ తెలిసింది. దానికి మీరు ప్రాధాన్యత ఇస్తే, మీ మీద ప్రొద్దుటూరులో అనేకులకు ఎటువంటి దురభిప్రాయములున్నవో మీకు తెలియదా? ఈ విషయం మీదే గతంలో మీకు ఒక ఉత్తరం కూడా వ్రాశాను.

మహాసభ మీ వేమయ్య, మరో ఒకరిద్దరి సర్పపరిష్వంగములో ఉంది. దీనికి మోక్ష మెప్పుడో? - అనే వారూ,

వేదాంతిని అని చెప్పుకుంటూనే మీ వేమయ్య గారు మహాసభపై పట్టుకుపడే ఆరాటమూ, తాను మహాసభలో లేకుంటే మహాసభ భవనాలనే అమ్ముతారని భావించుతారు - అనే వారూ,

మహాసభ మీదే కాదు జిల్లా సంఘము పైన కూడ పట్టులేకపోతే మీ వేమయ్య భరిస్తాడా? - అనే వారూ,

పైకి వేదాంతే. అనుష్టాన వేదాంతి కాదనే వారూ - వేదాంతే అయితే ఈ లౌకిక విషయాల మీద ఇంత ఆసక్తి, ఆరాటమూ ఎందుకు? - అనే వారూ,

తాను జీవించి ఉన్నంత వరకూ కడప జిల్లాలో మరొకరు మహాసభ అధ్యక్షుల య్యేందుకు మీ వేమయ్యకు మనస్సు ఒప్పుతుందా? - అనే వారూ - అనేకులు ఉన్నారు. మీరు పెద్ద నాయకులు - ప్రజల్లో తిరుగరు. అందువల్ల అనేక విషయాలు తెల్తియవు, తన వీపు తనకు కనిపించదు అనేది ఇటువంటిదే.

మీకు సంబంధించిన పై అంశాలకు ప్రాధాన్యత ఇవ్వడము ఎంత సమంజసమో? నాకు సంబంధించిన విషయాలకు ప్రాధాన్యత ఇవ్వడమూ అంతే సమంజసము.

స్థానికమైన అసూయలు శ్రీ రోశయ్య గారి పైన ఇప్పటికీ ఉన్నాయి. ఈనాడు నా యెడ నిష్కారణ ద్వేషం, అసూయ, మాత్సరం ప్రదర్శించే వ్యక్తి మీకు బంధువే కావచ్చు - మహాసభలో మీరు ఉన్నత పదవులదిష్టించుటలో ఎంత వరకు ఆ వ్యక్తి మీకు సహకరించారు. బహుశా మీరు విస్మరించి ఉంటారు శ్రీ రోశయ్య గారితో మీకు పరిచయము కల్గడం నావల్లనే.

నా ఆకాంక్షను తెలుపుతూ మీకు వ్రాసిన ఉత్తరానికి "నీవు మహాసభ అధ్యక్షులుగా ఉండాలనే కోరికను వెలి బుచ్చావు. సంతోషము. నీ హితాన్నీ, నీ శ్రేయస్సునూ కోరే వాడిని కావున నా ఆశీస్సులు ఎప్పుడూ ఉంటాయి. అందుకు ఆలోచన అక్కరలేదు." అని 18.9.96న జవాబు వ్రాశారు. సరిగ్గా సమయం వచ్చినపుడు ఇలా వ్యవహరించడము మీ చిత్తశుద్ధికి మచ్చ గాదా?

"మిత్రుడు లక్ష్మీకాంతం జీవితము యావత్తు వైశ్యజాతి ఉద్ధరణకు నాంది పలికింది" అని గూడ వ్రాశారు. ఆ సేవలూ - కృషీ మహాసభకు అర్హతలు కావా? వాటి విలువ రూ.105/-లేనా? 28 సంవత్సరాలుగా నేను వైశ్య సంఘానికి తదేక దీక్షతో చేస్తున్న వివిధ రకాల సేవల విలువ రూ.105/-లే అని మీ పెద్దలు అనుకుంటే ఆ అధ్యక్ష పదవే నాకు వద్దు.

నియమావళిని సాకుగా తీసికొని మాట్లాడుచున్నారు కదా? కొండాపురములో జరిగిన ఎన్నికలు మహాసభ నియమావళి అనుసరించే జరిగాయా? మహాసభ నియమావళి అమెరికా రాజ్యాంగ పద్ధతి. అధ్యక్షులను మాత్రమే జిల్లా జనరల్ కౌన్సిల్ ఎన్నుకొంటుంది. పిదప మిగతా కార్య వర్గానికి ఆ ఎన్నికైన అధ్యక్షులు తనకు అనుకూలమైన వారలను నియమించు కొంటారు. మీ రాజీ సూత్రము ప్రకారము 1998 మార్చి నుండి నూతన అధ్యక్షులు జిల్లా సంఘానికి వస్తారు. అప్పుడు ఈ కార్యవర్గమంతా రద్దు కావాలి కదా! ఈ సందేహం వచ్చి కొందరు నా వద్దకు వచ్చి అడిగారు. మార్చుకోవచ్చు అని చెప్పాను. ఇక్కడ మీ నియమావళి ఎంత వరకూ పాటించబడింది.

"లక్ష్మీకాంతం శ్రీ రోశయ్య గారికి జాబు వ్రాసి శ్రీ రోశయ్య గారి వద్ద ఉన్న ఆ కాస్త అవకాశాన్నీ పోగొట్టు కున్నాడు" అని హైద్రాబాద్‌లో కొందరు మిత్రులతో అన్నారట. నేను శ్రీ రోశయ్య గారి వద్దకు వెళ్ళి మీరన్న పై మాటలనే వల్లించి "నేను మీవద్ద పోగొట్టుకొన్నది ఏమిటీ" - చెప్పండి అని అడిగాను. ఆయన అలా నేను అనలేదు, అని అన్నారు.

దాదాపు 20 ఏండ్లు మీ అందరితో తిరిగాను. మీరు చెప్పిన పనులన్నీ చేశాను. మీ అందరినీ పరిచయం చేశాను. సమయం వచ్చినపుడు నా పేరు మీకై మీరే ప్రతిపాదించడము ధర్మము అలా ప్రతిపాదించడము మీకు కర్తవ్యము కూడ. ఈ విధంగా అవకాశం వచ్చినపుడు ఇలా వ్యవహరిస్తారు అనుకోలేదు.

ఒకటి గుర్తు పెట్టుకోండి. కుట్రలు కుతంత్రాలతో ఈ విషయములో నాకు సహకరించక పోయారనుకోండి అధ్యక్ష పదవి రాదు. అంతకన్నా మీరు ఏమీ చేయలేరు. వాస్తవం ప్రజలు గుర్తించి నపుడు మీ యెడ కలిగే భావాలు ఎట్లుంటాయో ఒకసారి ఆలోచించండి.

నా యీ అభిప్రాయాలను - ప్రొద్దు టూరులో కొందరు పెద్దలకు చెప్పినపుడు మీ వేమయ్య గారితో స్వయంగా ఎందుకు మాట్లాడ కూడదు అన్నారు. అలా నేను మిమ్ములను ఎదురుగానే అడగగలను. కానీ వాటికి సాక్ష్యాలు ఉండవు సాక్ష్యాలు లేనప్పుడు వాస్తవం ఎప్పటికీ బహిర్గతము కాదు.

ఈ సుదీర్ఘ లేఖను బ్లాక్‌మెయిల్ చేసేందుకు వ్రాసినట్టిదిగా మీరు భావిస్తారు. అందుకు సందేహము లేదు. అలా భావిస్తే దానికి బాధ్యున్ని నేను కాను. పని చేసే వానికి పదవులా? అనే భావాలు మీ వంటి పెద్దల్లో ఉంటాయని భావితరం గుర్తుంచు కొనుటకు వ్రాత మూలక సాక్ష్యాలుగా ఉండాలనేది ఇందులోని నా అభి ప్రాయము.

నా యీ సుదీర్ఘ లేఖ మీలో తప్పక మార్పు తెస్తుందని ఆశిస్తూ, అటువంటి మార్పును మీలో జగన్మాత శ్రీ వాసవీ దేవి కల్పిస్తుందనీ విశ్వసిస్తున్నాను. మీకు గుర్తుకు వచ్చుటకు వీలుగా మీరు వ్రాసిన లేఖలు రెంటినీ, ఈ లేఖతో పంపు చున్నాను.

నమస్సులు .

భవదీయుడు

పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి, 14-2-97

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

రిజిష్టర్డు నెం. 328/94

## బ్రహ్మంగారి మఠం - 516 603. కడప జిల్లా.

భారతదేశములోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠమూ ఒకటి. కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రికులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8.2.1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు 5 11.1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది.

ఈ అన్నదాన సంఘానికి

రూ 10,116/-లు ఇచ్చిన ధాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ.2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం.

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు.

రూ.10,516/-లు లేక అంతకు మించి ఇచ్చిన వారు, పై సంఘమునకు శాశ్వత వంశ పారంపర్య సభ్యులుగా ఉందురు. దాత తన హయాములో గానీ, తదనంతరము కానీ తనకు మారుగా దాతచే సూచించబడినవారు ఈ సంఘములో శాశ్వత సభ్యులుగా ఉందురు. సంవత్సరములో 6 రోజులు వీరికి ఉచిత సౌకర్యము కలిగించబడును.

రూ.5,116/-లు ఇచ్చిన దాతల పేరున 10 × 19 అడుగుల అటాచ్డ్ బాత్‌రూముతో కూడ రూము నిర్మించబడును. వీరికి సంవత్సరములో 30 రోజులు ఉచిత సౌకర్యము కలిగించబడును.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కును కానీ, క్రాస్ చేసిన డి డి ని కానీ ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులో నైనా చెలామణి అగునట్లుగా, పై అడ్రసుకు పంపి, రశీదు పొందగోరుచున్నాము.

5 వేలరూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనము నందు ఉంచుతారు.

భవన నిర్మాణ కార్యక్రమం శీఘ్రగతిన సాగుచూ ఉంది. ఈ పవిత్ర కార్యక్రమానికి సహకరించ దలచుకొన్న పవిత్ర హృదయులగు వైశ్య మహనీయులను వెంటనే సహకరించగోరుచున్నాము.

**జూటూరు శరభయ్య**
కార్యదర్శి

**'ప్రజాబంధు', 'దానశీల' కామిశెట్టి సుబ్బరావు**
అధ్యక్షులు

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.4.1997 నుండీ 20.5.1997 వరకు)

చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు తాము కట్టవలసిన అమ్మకం పన్ను మొత్తానికి చెక్కును వ్రాసి ఏప్రిల్ నెల 15వ తేదీలోగా అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారులకు అందునట్లుగా ప్రతి నెలా పంపవలసిన A-2 రిటర్న్లను పంపాలి. చెక్కు ద్వారా కాకుండా చలానా ద్వారా అమ్మకం పన్నును చెల్లించు అసెసీలు తాము పంపవలసిన A-2 రిటర్న్లను ఏప్రిల్ నెల 20వ తేదీన గానీ, అంతకు ముందుగా గానీ చేరునట్లుగా పంపాలి.

పదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1997 మార్చి నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు స్టేట్మెంటును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ ఏప్రెల్ నెల 31వ తేదీలోగా చేర్చాలి.

1997 మార్చి నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ ఏప్రెల్ నెల 31వ తేదీ లోగా చేర్చాలి.

1996–97 ఆర్థిక సంవత్సరములో మీరు మీ ఉద్యోగస్తుల జీతముల నుండీ తగ్గించిన ఆదాయపుపన్ను వివరాలకు సంబంధించిన సర్టిఫికేట్ను 16వ నెంబరు ఫారములో ఈ ఏప్రెల్ నెల 30 వ తేదీలోగా ఇవ్వాలి.

1996–97 ఆర్థిక సంవత్సరములో ఇన్సూరెన్సు కమీషను నుండీ పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు సర్టిపికేట్ 16 A నెంబరు ఫారాన్ని ఈ ఏప్రెల్ నెల 30వ తేదీ లోగా ఇవ్వాలి. 1996–97 ఆర్థిక సంవత్సరములో డివిడెండ్ను తెలుపు అన్యువల్ రిటర్న్ 26వ నెంబరు ఫార్మాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఏప్రెల్నెల 30వ తేదీలోగా చేర్చాలి.

1996–97 ఆర్థిక సంవత్సరములో ఆదాయపుపన్ను చట్టము 194వ సెక్షన్లోని మొదటి నిబంధన క్రింద ఆదాయపుపన్నును తగ్గించకుండా చెల్లించిన డివిడెండ్ వివరమును తెలుపు రిటర్న్ 27వ నెంబరు ఫారాన్ని

అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ ఏప్రెల్ నెల 30వ తారీఖులోగా చేర్చాలి.

1996–97 ఆర్థిక సంవత్సరములో ఆదాయపు పన్నును తగ్గించకుండా చెల్లించిన వడ్డీ వివరాలను తెలుపు రిటర్ను 27 A నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి ఈ ఏప్రెల్ నెల 30వ తేదీలోగా చేర్చాలి.

1996 అక్టోబరు 1–1997 మార్చి 31 తేదీలతో అంతమయ్యే అర్థ సంవత్సరపు (HALF YEARLY) ఆదాయపు పన్ను వసూళ్లను తెలుపు రిటర్నులు 27 EA, 27 EB, 27 EC, మరియు 27 ED లను అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ ఏప్రెల్ నెల 30వ తేదీలోగా చేర్చాలి.

## కొప్పరపు చిన్న వెంకట సుబ్బయ్య ఇకలేరు

కర్నూలు జిల్లా ఆళ్ళగడ్డ పుర ప్రముఖులు, చక్కని కార్యకర్త, హిందీ భాషాభివృద్ధికి మిక్కిలి కృషి జేసిన వ్యక్తి, పత్రికా రచయిత, పత్రికా సంపాదకుడు శ్రీ కొప్పరపు చిన్న వెంకట సుబ్బయ్య శ్రేష్ఠి గారు 19-3-1997 స్వర్గస్తులయ్యారు. సార్వజనిక సేవతో బాటు, వైశ్య సంఘ సేవను గూడ శక్తి వంచన లేకుండా చేసిన వారు కూడ వీరు. వైశ్య సంఘానికి వీరు లేనిలోటు తీర్చరానిది.

## కొల్లి వెంకట సుబ్బరావు మృతి

ప్రకాశం జిల్లా కంభం వైశ్య ప్రముఖులు శ్రీ కొల్లి వెంకట సుబ్బరావు గారు 22-3-1997 వ తేదీన స్వర్గస్తులయ్యారు.

## ఏప్రెల్ 20వ ఆదివారం స్టేట్ కౌన్సిల్ మీటింగ్ - శ్రీశైలంలో

ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య అఫిషియల్స్ అండ్ ప్రొఫెషనల్స్ అసోసియేషన్ స్టేట్ కౌన్సిల్ మీటింగు 20-4-1997న ఆదివారము శ్రీ శైల క్షేత్రములోని ఆల్ ఇండియా శ్రీ శైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ (కంభం) సత్రములో జరుగును. సదరు అన్నసత్రం అధ్యక్షులు శ్రీ పోలిశెట్టి సత్యనారాయణ గారు ముఖ్య అతిథులు గానూ, మార్కాపురం శ్రీ చెన్న కేశవ స్వామి దేవాలయ ధర్మ కర్తృత్వ మండలి అధ్యక్షులు శ్రీ యక్కల బాలరత్నం గారు గౌరవ సన్మానితులు గానూ యీ మీటింగులో పాల్గొన్నారు.

**జీవిత సభ్యత్వ చందా రూ. 400/-**

## INDIAS' FINEST SOUND SYSTEMS

- ☆ Concessional Price For Temples.
- ☆ Free Installation Technical Guidance
- ☆ Trouble Free Performance One Year Guarantee




RADIO'S
TAPE RECORDERS
TWO-IN-ONES



PHILIVISION
B&W AND COLOUR TVS

*Authorised Dealers :*

**M/s. The Gupta Trading Company,**
256, MAIN ROAD,
NANDYAL - 518 501 ✆ : 2276




---

✆ Offi : 22201
Resi : 22642

## M/s. MADHAV INDUSTRIES

*LESSES*

**Sri Gajalakshmi Ginning Shelling Factory**
and
**Sri Vishnu Cotton Press**
Most Popular in Ginning & Pressing

NANDYAL - 518 503
Kurnool Dist. ( A.P. )

